.ssued on 9-2-60

ol II
.No 1




24th February, 1959
(Tuesday)

# ANDHRA PRADESH LEGISLATIVE ASSEMBLY DEBATES

## Official Report

PART II - Proceedings other than Questions and Answers



Note — * at the commencement of the speech denotes confirmation from the Member not received in time

Printed By Nagarjuna Printing Works, Hyderabad
For The Director, Government Press, Hyderabad.
1 9 6 0

# THE
# ANDHRA PRADESH LEGISLATIVE ASSEMBLY DEBATES

*[Part II – Proceedings, other than Questions and Answers]*

OFFICIAL REPORT

---

*Thirtieth day of the Eighth Session of the Andhra Pradesh Legislative Council*

---

**ANDHRA PRADESH LEGISLATIVE COUNCIL**

**Tuesday, the 24th February, 1959**

The House met at Half Past Nine of the Clock

*[Mr. Speaker in the Chair]*

Questions and Answers

*[See Part I]*

## BUSINESS OF THE HOUSE

మిస్టర్ స్పీకర్ : ఇప్పుడు ప్రజాపార్టీ సభ్యులము అసెంబ్లీలో వ్యతిరేక పక్షమునకు చెందిన పార్టీగా కూర్చోటానికి నిర్ణయించుకున్నామని, వారికి అందులో సీట్లు ఏర్పాటు చేయవలసిందిగా కోరుతూ, ప్రజాపార్టీనాయకులైన శ్రీ బత్తిన రామకృష్ణా రెడ్డిగారు నాకు వ్రాశారు. సరే, అట్లాగే కూర్చోవచ్చు. దానికి నాకేమీ అభ్యంతరము లేదు.

తరువాత నేషనలిస్టుపార్టీ సభ్యులు శ్రీ మాదరాజుగారు "డెమోక్రాటిక్ పార్టీలో చేరుతానని ఇదివరకు వ్రాశారు. కాని ఆ నిర్ణయమునుమార్చుకున్నాను, నేషనలిస్టుపార్టీలోనే ఉంటా"నని మరల వ్రాశారు. సరే, దీనికికూడ నాకేమి అభ్యంతరము లేదు. వారు అక్కడే కూర్చోవచ్చు.

పిల్లలమర్రి వెంకటేశ్వర్లు (నందిగామ) : వారి మనస్సు మరల మారితేనో ?

మిస్టర్ స్పీకర్ : మార్చుకుంటే, అప్పుడు చూద్దాము.

శ్రీ వి. విశ్వేశ్వరరావు (మైలవరం) : On a point of information, Sir. Nationalist Party Leader ను కాంగ్రెసుపార్టీలోనికి తీసుకున్నట్లుగా తెలుస్తున్నది. అలాగయితే Nationalist Party ఉంటుందా ?

మిస్టర్ స్పీకర్ : వారిని కాంగ్రెసుపార్టీలోనికి తీసుకున్నప్పటి మాటగదా?

శ్రీ వి. విశ్వేశ్వరరావు : కాంగ్రెసుపార్టీలోనికి తీసుకున్నట్లుగా పేపర్లలో

శ్రీ జి. ఎల్లమందారెడ్డి (కనిగిరి) : వారిని P.C.C. ... opt చేసుకున్నట్లుగా పేపర్లలో వచ్చింది.

మిస్టర్ స్పీకర్ : అది ఏమో నాకు తెలియదు ... నోటీసుకు రాలేదు.

ఒక గౌ॥ సభ్యుడు : అలాంటిది ఏమీ జరగలేదు

శ్రీ పిల్లలమర్రి వెంకటేశ్వర్లు : Point of clarification, Sir బైట కాంగ్రెసు కమిటీ మెంబరుగా నుండి ఇక్కడ అసెంబ్లీలో Nationalist Party Member గా కూర్చోటానికి వీలు అవుతుందా ? ఏ position ను clarify చేయాలని కోరుతున్నాను. అక్కడ P.C.C. లో ... స్థానములో కూర్చొని ఉంటారు గనుక ఇక్కడ ఆ విధంగా కూర్చోటానికి వీలుంటుందా

శ్రీ ఆర్. బి. రామకృష్ణరాజు (పిడుమర్తిపేట) : ... గురించి నిన్న పత్రికలలో వచ్చింది దానికి నేను ... వచ్చిన తరువాత గౌ॥ సభ్యులు clear గా తెలుసుకోగలరు.

శ్రీ ఎస్. శ్రీనివాసరావు : మాచరాజుగారు రాజీనామా ఇచ్చారా?

మిస్టర్ స్పీకర్ : కావాలంటే ఇస్తారు. దానికేమి ?

శ్రీ కె. వెంకటరెడ్డి (నందిపాడు) : ఆ విషయము మీరు చెప్పవలెను ...

మిస్టర్ స్పీకర్ : ఇవ్వండి అని మీకు ఎట్లా చెప్పానో, వారికి అట్లాగే చెబుతున్నాను. మీరు Nationalist Party కి రాజీనామా ... Democratic Party లోనికి వెళ్ళినారా?

శ్రీ ఆర్. బి. రామకృష్ణరాజు : ఆయన ఇంకా రాజీనామా ఇవ్వలేదు.

మిస్టర్ స్పీకర్ : వారి రాజీనామా ఇంకా మీకు చేరలేదా?

శ్రీ ఆర్. బి. రామకృష్ణరాజు : ఇంకా చేరలేదండి.

మిస్టర్ స్పీకర్ : అది వస్తే, అది ఎవరికి పంపవలెనో, దానిని వారికి పంపిస్తాను. అది ఒక formality. ఇప్పుడు ఒక్క విషయమును గురించి అడిగారు-బైట Congress Organization లో P. C. C. మెంబరుగా ఉండి ఇక్కడ opposition party లో-అంటే Non- Congress Party లో కూర్చోవచ్చునా అని అడిగారు. వారు Non- Congress Party సభ్యుడుగా elect అయి వచ్చారు. వస్తే ఇప్పుడు ఏమి చేయాలి అని ప్రశ్న ... నాకు సంబంధించినదల్లా, election; ఇక్కడ సభలో ఒకే ... పార్టీ సభ్యుడుగా కూర్చోవడము అంతవరకే. కాని, కాంగ్రెసు మెంబరుగా ... , ఇక్కడ ఇంకొక పార్టీలోకి పోయి కూర్చుంటే, అది అంతా political action. disciplinary action అంతా ఆ పార్టీవారే చూచుకొంటారు. వారికి ఇష్టము లేకపోతే వెళ్లగొట్టు

[illegible] ఇష్టమైన, ఏదేది అనుకుంటే, వారి పార్టీలోనే ఉంటుంటారు. అది వారి ఇష్టము. దానితో నాకేమి సంబంధము లేదు. కాబట్టి ఇప్పుడు ఉన్న ప్రశ్న ఏమి అంటే టైటు ఒక పార్టీలో సభ్యుడుగా ఉండి, ఇంకొక పార్టీ సభ్యుడుగా అసెంబ్లీలో కూర్చోవచ్చునా అని రెండవ పార్టీకి సంబంధము లేకుండా. ఇక్కడ మాత్రము ఒకే ఒక పార్టీలో కూర్చోవాలి. అంతే. ఇప్పుడు political గా కొన్ని పార్టీలు పెట్టుకున్నారు. groups పెట్టుకున్నారు. అది అంతా పార్లమెంటరీ సాంప్రదాయము ననుసరించి పని చేసుకోవలసి ఉంటుంది కాబట్టి మనమందరము ఏ పార్టీకి చెందినవారు ఆ పార్టీలో కూర్చొని శాంతియుతముగా కార్యక్రమము నడుపుకోవాలి. అదే నా request. ఇతర విషయాలతో నాకు ఏలాంటి సంబంధము లేదు.

శ్రీ బి. ఎల్లమందారెడ్డి: అధ్యక్షా, Legislature Party అనేది. లోపల టైటు పార్టీ ప్రోగ్రాము, దానికి ఒక symbol, election, వగైరాలు అన్నీ ఉంటాయి గదా వాటితో మీకేమి సంబంధం?

మిస్టర్ స్పీకర్: అక్కరలేదు. ఇక్కడ ఏ పార్టీ తరఫున వచ్చి కూర్చుంటారో, అది నాకు లెక్క. ఇతర వాటితో సంబంధము లేదు. ఎలక్షను కాగానే, speaker హోదాలో నాకు ఏ పార్టీలో ఎవరెవరు, ఎంతమంది ఉండేది ఆ లిస్టు నా వద్దకు వస్తుంది. ఆ లిస్టు ప్రకారము సీట్లు ఏర్పాటుచేస్తాను. ఆ ప్రకారము కూర్చోవాలి. అంతే కాని వారి ఎలక్షనుతో నాకు సంబంధము లేదు ఎలక్షనులో ఏమి జరిగింది, హైకమాండు ద్వారా వచ్చారా, Low command ద్వారా వచ్చారా, అది అంతా నాకు అక్కరలేదు. ఇక్కడకు వచ్చినప్పుడు మాత్రము ఒకే పార్టీలో కూర్చుని ఉండాలి. రెండు పార్టీలతో సంబంధము పెట్టుకోకూడదు. అంతే. ఏదో ఒక పార్టీ తరఫున ఎన్నికై వచ్చి కూర్చుంటారు లేకపోతే ఇంకొక పార్టీలోనికి మారుతారు. అది నాకు తెలియజేయాలి. తెలియజేయగానే, వారిని ఆయా పార్టీల సీట్లలో కూర్చోపెడతాను. నాకు సంబంధము అంతవరకే తప్ప వారి election పట్ల పూర్వోత్తరములతో నాకు సంబంధము లేదు.

## MESSAGES FROM THE COUNCIL

*Mr. Speaker* : I have received the following messages from the hon. Chairman, Andhra Pradesh Legislative Council :—

*The Madras Motor Vehicles (Taxation of Passengers and Goods) (Andhra Pradesh Amendment) Bill, 1959,*

1) "In accordance with Rule 111 of the Andhra Pradesh Legislative Coucil Rules as adopted under clause

(2) of Article 208 of the Constitution of India, I retu herewith a copy of the Madras Motor Vehicles (Taxati of Passengers and Goods) (Andhra Pradesh Amendmen Bill, 1959 (L. A. Bill No. 4 of 1959) which was passed b the Legislative Assembly at its sitting held on the 18 February, 1959 and transmitted to the Legislative Counc for its recommendations, duly signed by me and state th this House has no recommendations to make to the Legi lative Assembly in regard to the said Bill".

*The Krishna District Road Transport Service (Validation) Bill, 1959.*

2) "In accordance with Rule 111 of the Andhra Pradesh Legislative Council Rules as adopted under clause (2) of Article 208 of the Constitution of India, I transmit a copy of the Krishna District Road Transport Service (Validation) Bill, 1959 (L. A. Bill No. 1 of 1959) as passed and agreed to by the Council on the 21st February, 1959 without any amendment and signed by me."

*The Madras Motor Vehicles (Taxation of Passengers and Goods) (Andhra Pradesh Second Amendment) Bill, 1959.*

3) "In accordance with Rule 111 of the Andhra Pradesh Legislative Council Rules as adopted under clause (2) of Article 208 of the Constitution of India, I transmit a copy of the Madras Motor Vehicles (Taxation of Passengers and Goods) (Andhra Pradesh Second Amendment) Bill, 1959 (L. A. Bill No. 3 of 1959) as passed and agreed to by the Council on the 21st February, 1959 without any amendment and signed by me."

శ్రీమతి ఆరుట్ల కమలాదేవి (ఆలేరు) : అధ్యక్షా, నేను ఒక adjournment motion ఇచ్చాను. దాని సంగతి ఏమి అయిందో తెలియలేదు.

మిస్టర్ స్పీకర్ : ఇలాంటివి అన్నీ నేను ఆఫీసుకు పంపుతాను. అక్కడి నుండి నోటీసుతో సహా వచ్చిన తరువాత వాటి విషయము తీసుకుంటూ ఉంటాను.

శ్రీ యం. నాగిరెడ్డి (మాచెర్ల): అధ్యక్షా, నేను ఒక adjournment motion ఇస్తే దానిని 18వ తేదీ నాడే తీసుకుంటానని చెప్పినారు. 18వ

పోయిండి. 19వ తేదీన అడిగితే మంత్రిగారి వద్ద నుంచి information జని అన్నారు. అది నాగార్జునసాగర్ ప్రాజెక్టుకు సంబంధించినది. ఇంతవరకు విషయమే ఎత్తలేదు.

మిస్టర్ స్పీకర్ : అది ఇంకా జరుగుతున్నదా ?

శ్రీ ఎం. నాగిరెడ్డి : ఇంకా జరుగుతునే ఉన్నదండి.

శ్రీ పి. గున్నయ్య (పాతపట్నం-రిజర్వుడు) : 19వ తేదీన ప్రశ్నలు మరల అసెంబ్లీ ఎదుటకు వస్తాయా; లేకపోతే lapse అయి పోతాయా ?

మిస్టర్ స్పీకర్ : నేను ఏమి చెప్పానో జ్ఞాపకములేదు. కాని, ఇప్పుడు నేనేమీ ఓరల్‌గా చెప్పలేను.

## PRIVILEGE MOTION RE:

### *The alleged remarks of the District Collector, Vishakapatnam against the M L.As.*

మిస్టర్ స్పీకర్ : శ్రీ సాగి సూర్యనారాయణరాజుగారు విశాఖపట్టణం జిల్లా కలెక్టరుగారు కొన్ని అసభ్యమైనటువంటి remarks Legislative Members మీద pass చేసినారని ఒక privilege motion ఇచ్చినారు. ఈ Privilege Motion విషయమై మరల పట్టమంతా జాగ్రత్తగా చదివాను. ఎందుకంటే ఇటువంటివి చాల వస్తున్నవి. మీరు చెప్పేది విన్న తర్వాతనే నేను orders pass చేస్తాను. కలెక్టరుగారు members ను insult చేసేటటువంటి వాక్యాలు పలికివుంటే అది privilege క్రింద వస్తుంది. శాసన సభ్యులను సర్కారు ఉద్యోగస్తులు ఎందుకు dismiss చేయకూడదని వారు public meeting లో అన్నారని చెప్పుచున్నారు కలెక్టర్‌గారు చేసిన remarks ను గురించి గవర్నమెంటు వారేదైనా చెప్పేదరా ? మీరు ఆయనకు వ్రాసి, reply వచ్చిన తర్వాత, అయనది తప్పుగా ఉంటే ఏదైనా warning ఇస్తారా? లేకపోతే Privileges Committee కంపించేధా?

శ్రీ ఆర్. వి. రామకృష్ణరాజు : అధ్యక్షా, మీరు చెప్పేది మాకు అర్థం కావడములేదు.

*Mr. Speaker* : Yes, I am reading. "I hereby give notice for the motion of privileges under Rule 174 of Andhra Pradesh Legislative Assembly Rules. "The District Collector, Visakhapatnam, on the 24th December 1958

said in a public meeting during his speech on the occasion of N. E. S. Block Opening at Vaddadi, Visakhapatnam District, that it would have been better, if they (Government servants) are given the powers to dismiss M.L.As. also, which is breach of privilege." అని అన్నారు. వారికి కూడా dismiss చేయడానికి power యిస్తే చాల బాగుంటుందని M.L.As. ను dismiss చేయాలని సర్కార్ ఉద్యోగస్థులనుండి రావడమంటే, అది intolerable. M.L.As. are the Sovereign Body. వారు వీరి నౌకర్లు. ఉద్యోగస్థులు అంటే సెక్రెటరీల దగ్గర నుంచి గ్రామవెట్టివరకు కూడా— they are the servants of the Govt. and the Govt. represents the Sovereign Body. M.L.As. ను dismiss చేయడానికి మాకు అధికారముండాలని నీచముగా మాట్లాడిన మాట నిజమైతే అది privilege క్రింద వస్తుందని నా ఉద్దేశము. దీనిని గురించి గవర్నమెంటువారు ఏమైనా చెప్పదలిస్తే లేకుంటే Privileges Committee కి పంపించమంటారా?

శ్రీ డి శ్రీరామమూర్తి (మాడుగుల): అధ్యక్షా. ఇది నా సమక్షములో జరిగింది. ఆ meeting ను నేను conduct చేయించాను. కలెక్టర్‌గారు ఆ మాదిరిగా సమాధానము చెప్పలేదు. ఇంకొక విధంగా అర్థము చేసుకొని వారలాగు చెప్పివుంటారే కాని కలెక్టర్‌గారు మాత్రము అలగని మాట్లాడలేదు.

శ్రీ డి. రామబ్రహ్మం (కుప్పం): అధ్యక్షా, కలెక్టర్ల conference యీ రోజు జరుగుతుంది. ఆ కలెక్టర్‌గారు కూడా ఇక్కడికి వచ్చివుంటారు. ఈ విషయమును క్షమగొని రేపటికి దీనిని వాయిదా వేస్తే బాగుంటుందని మనవి చేస్తున్నాను.

శ్రీ జి. లచ్చన్న (సోంపేట): అధ్యక్షా, నా information ఏమంటే జిల్లాలో యీ సంగతుల గురించి చాలా విరివిగా చర్చించుకోవడం జరిగింది. ఇటీవలనే, నేనా జిల్లాకు వెళ్లినపుడు నాకు తెలిసిన ధోరణిబట్టి ఏమంటే—ఉద్యోగస్థుల వ్యవహారాలేమీ బాగులేవని సభ్యులు కొంచెము విమర్శించగా విని, వెంటనే కలెక్టర్‌గారు, యీ ప్రభుత్వ ఉద్యోగస్థులను dismiss చేసే అధికారము శాసన సభ్యులకే ఇచ్చివేస్తే బాగుంటుంది; మనుష్యులను పడే పడే [illegible] ధోరణిలో వారు మాట్లాడారని నా information. అందువల్ల అది నిజమో, ఇది నిజమో తమరు కనుగొంటే బాగుంటుంది.

శ్రీ ఎ. శ్రీరామమూర్తి (విజయనగరము) :- అధ్యక్షా, అది నిజంగా జరిగివున్నట్లైతే తప్పనిసరిగా Privileges Committee పంపవలసి ఉంది. కాని అది జరిగిందా లేదా అనేదే ప్రశ్న. ఇది పట్టాలలో జరిగింది. అక్కడవున్న శాసన సభ్యుడు శ్రీ టి. శ్రీరామమూర్తి. వారు ఏర్పాటుచేసిన మీటింగుకు కలెక్టరుగారు హాజరైనారు. ఆ సందర్భంలోనే శ్రీ సాగి సూర్యనారాయణరాజుగారు ఆహ్వానము మీద వచ్చారు. అందుచేత అక్కడ ప్రత్యక్షంగా వున్నవారే స్పష్టము చేస్తున్నారు ఆ సందర్భంలో ఆ రకంగా అనలేదని. అంతే కాదు, ఇందులో ఇంకొక విషయం కూడా ఇమిడివున్నది. కాంగ్రెస్ తరపున గెలిచినటువంటి శాసన సభ్యులు గెజెటెడ్ ఆఫీసర్లను చాలమందిని బదిలీ చేశారని, అనేక సందర్భములలో వారిని నేనే బదిలీ చేయించాననిఅ విధంగా ఆ మీటింగులో శ్రీ సాగి సూర్యనారాయణరాజు గారు చెప్పడము జరిగింది. వారే యీ petition ను అందజేసినవారు "బదిలీ ఎందుకు, dismiss చేసే అధికారము కూడా మీరే తీసికుంటే బాగుంటుందన్న సంభాషణ తప్ప కలెక్టరుగారు ఆ విధంగా అనలేదు.

మిస్టర్ స్పీకర్ :- వారి మాట ఏమిటెందుకు. శ్రీరామమూర్తిగారిని తగిన విధంగా గౌరవించేశక్తి నాకున్నది. ఈ విషయంతో మీ remarks తో పని లేదు. ఒక గౌరవసభ్యుడు అన్నాడని ఇచ్చారు. ఇంకొక గౌరవసభ్యుడు ఆయన అనలేదన్నారు. కనుక శ్రీ నరసింహమూర్తిగారు చెప్పింది విచారము వారేమో మాట్లాడుతున్నారు.

శ్రీ బి. నరసింహమూర్తి (అమలాపురము) :- అధ్యక్షా. తీర్మానము తీసుకొచ్చిన సభ్యులు అక్కడ actual గా ఏమిజరిగిందో చెప్పిన తర్వాత మిగిలిన ..

మిస్టర్ స్పీకర్ : వారుచెప్పారు-కలెక్టరుగారు యీ మాట అన్నారని.

శ్రీ బి నరసింహమూర్తి : వారు విపులంగా మాట్లాడలేదండి

మిస్టర్ స్పీకర్ : తమరు కూర్చోండి. మీరంతా మాట్లాడుతున్నారు కాబట్టి వారిప్పుడు జవాబు చెప్పలేదు.

శ్రీ డి. కొండయ్య చౌదరి (రేపల్లె) : అధ్యక్షా, ఇటువంటి తీర్మానము వచ్చినప్పుడు ఊరకే members చెప్పినటువంటి ధోగట్టు ప్రకారమే privilege వొస్తుందా? లేకపోతే ఒక paper ద్వారానో లేక వార్తాపత్రికలో ఇట్లా అన్నాడని ఏదైనా authoritative గా రావలసిన అవసరమున్నదా? లేక ఊరకనే మెంబర్లు వచ్చి ఫలానా జిల్లా కలెక్టర్ యీ మాదిరిగా అన్నాడు కాబట్టి దీనిని privi-

lege motion క్రింద prima facie గా తీసుకొని అసెంబ్లీ వారికి పంపించ వచ్చు దానికి అవకాశమున్నదా? దీనిని గురించి తాము ruling ఇస్తే బాగుంటుంది.

మిస్టర్ స్పీకర్ : గౌ. సభ్యులు చెప్పింది సరైందికాదు. Paper report కంటే సభ్యులు అక్కడ మేము విన్నాము; చూచామనేటటువంటిది చాల important. Paper లో correspondents వ్రాసినటువంటిది important కాదని బాగుగా తెలిసికొనవలసియున్నది. తాము కాలము వృధా పోతుందనే మాట చాలతప్పు, కనుక దానిని మీరు withdraw చేసుకోండి. The paper correspondent might have written in an irresponsible manner. మెంబరు నా ఎదుట జరిగిందన్నప్పుడు— primafacie case is there. ఈ case లో ఇపుడు difference of opinion వస్తున్నది. కనుక దానిని గవర్నమెంటుకు refer చేసి విచారణ చేయడానికిస్తే బాగుంటుందేమో అని నా అభిప్రాయము. శ్రీ సాగి సూర్యనారాయణ గారూ తమరు సమాధానము చెప్పండి.

శ్రీ రాజా సాగి సూర్యనారాయణరాజు (నరసపట్నం: జనరల్) : తమరు నాకు అవకాశమిస్తే మనవి చేస్తాను.

మిస్టర్ స్పీకర్ : చెప్పండి.

శ్రీ రాజ సాగి సూర్యనారాయణరాజు : అధ్యక్షా, యీ విషయాన్ని గురించి తమ ద్వారా సభవారందరికీ తెలియజేస్తాను. అక్కడ జరిగిందేమిటంటే M. L. As. ను dismiss చేసే హక్కు, మాకుకూడా వుంటే బాగుండునని కలెక్టరుగారు సెల విచ్చారు. నా గౌరవము కొరకుకాదు నేను మనవిచేసేది. ఇది మన అసెంబ్లీ సభ్యు లందరికి వర్తిస్తుంది. భారత రాజ్యాంగము ప్రకారము M. L. As. కు ఉన్నహక్కు ఉద్యోగస్తులు యీ విధంగా భంగపరచడమైందని మనవిచేస్తున్నాను. నేనేదో అప్ర స్తుతంగా మాట్లాడానని M. L. As. చెప్పారు. మేము విన్నామనికూడా చెప్పు చున్నారు. ఆ విషయాన్ని గురించి చెప్పడానికి నాకు కొద్దిగా అవకాశమిస్తే మనవి చేస్తాను.

మిస్టర్ స్పీకర్ : చెప్పండి. మీరు చెప్తున్నారుకదా.

శ్రీ రాజా సాగి సూర్యనారాయణరాజు : పడ్డాది N. E. S. Block కు 24—12—58 సాయంత్రము 4 ఘంటల సమయంలో కలెక్టరుగారు ప్రారంభోత్స వము చేస్తున్న సందర్భంలో యీ మీటింగు జరిగింది ఈ మీటింగు సందర్భంలో Planning officer గారు నాకు invitation పంపించారు. ఈ Block కు ప్రారంభోత్సవము కలెక్టరుగారు చేస్తున్నారని మీరు రావలసినదని" అందులో ఇతర

కార్యక్రమాన్ని గురించి కూడా తెలిపారు. ఆ వర్డాది మెంబరైన శ్రీరామమూర్తిగారు కూడా కార్యక్రమమంతా తెలియజేస్తూ అందులోనే lunch కూడా ఏర్పాటుచేస్తున్నా ..వి హరిజనులచేత శ్రమదానము చేయిస్తున్నామని భోజనానికి దయచేసి invitation కార్డులు తీసుకరావలసిందని అదే కాపీకి add చేస్తూ మాకు invitation పంపించారు. యీ రెండు invitations చూచుకొని వెళ్ళటము న్యాయము, ధర్మము అని వెళ్ళాను. శ్రీరామమూర్తి గారే president గా వ్యవహారము నడిపించారు. వారిని ఎవరూ propose చేయలేదు. ఆ కార్యక్రమములో ఉన్న ప్రకారం speakers మాట్లాడిన తర్వాత నన్ను కూడా ఉపన్యాసమివ్వమని కోరారు. నేను మాట్లాడుతూ యీ N. E. S. Blocks లో వున్న కష్టసుఖాలను గురించి మనవి చేశాను. "ఉరట్ల Block లో మొట్టమొదట యీ head-quarters స్థాపన విషయంలో తగవువచ్చింది. దాని విషయంలో మేము collector గారు differ అయినాము. ఆఖరుకు గవర్నమెంటుకు వెళ్ళితేనే గాని మాకది తిరిగిరాలేదు. మీ head-quarters తగవుకూడా ఇపుడు ప్రారంభించారు. ఈ head-quarters తగవు మన జిల్లాలోనే కాకుండా ఇతర జిల్లాలలో కూడా ఉంది. ఇది చాల అసందర్భముగాను, అన్యాయముగాను చాల జోరుగా సాగిపోతుంది." దీనికి కారణులెవరంటే మొట్టమొదట Block head-quarters నిర్ణయం చేసిన ఉద్యోగస్థులు. లోపము వారిదై వుండాలి. ఎందుకంటే మొట్టమొదటనే మీ అందరి నిర్ణయము తీసికొనిన తర్వాత head-quarters ను నిర్ణయించి వుంటే యీ తగవులు ఫీల్డులో మీకురావు. ఆ మాదిరి చేయలేదు కనుక మీ Block లో కూడా యీ Block head-quarters తగవువచ్చింది

సమితుల బిల్లు ప్రభుత్వము పెట్టుచున్నారు. అది pass అవడానికి సిద్ధంగా ఉంది. సమితులలో భారత రాజ్యాంగము ప్రకారము నిర్ణయించుకునే హక్కు మీకు ఉంది. అలాంటి హక్కు మీకు ఉన్నప్పుడు లేనిపోని నిందలు వేయటము న్యాయముకాదు. నా Block లో నేను అనేక పనులు చేయించుకున్నాను. నాకు అధికారస్థులు ఉండి చేయించుకొనలేదు. జిల్లాకలెక్టరును chairman గాను, Block Officer ను సెక్రటరీగాను ఏర్పాటు చేస్తూ ప్రభుత్వము బిల్లు తెచ్చినది. దానిని మా M.L.A. లు వ్యతిరేకిస్తున్నారు. ఉద్యోగస్థులకు అధికారముండ కూడదనియు వారికే powers వుండాలనియు అంటున్నారు. District Boards, Taluk Boards ఉన్నప్పుడు మనకు అధికారాలు ఇచ్చినారు. 6 సంవత్సరాలు [illegible]స్తున్నది. ఇప్పుడు ఏ పరిస్థితులలో ఉన్నదీ మన కందరికీ తెలుసు. స్వతంత్రము [illegible] పెట్టిన [illegible] అయినంతటి పరిస్థితులలో

ఈ ప్రెసిడెంటులకు ఎక్కువ అధికారాలు ఇస్తే ఏమి జరుగుతుందో అర్థము కా డిములేదు. అందుచే ఉద్యోగస్థులను పెట్టి వారి అభ్యర్థన సమీపిస్తే గారింటు తిరు నేను అనుకొంటున్నాను. వారు సరిగా నడవరేమోనన్న భయము కూడ కలదు. ఉద్యోగస్థులు లంచము తీసుకుంటున్నారని గాని, క్రమముగా నడుచుటలేదని గాని అను కొన్నప్పుడు పనినుంచి తొలగించడము గాని, transfer చేయడము గాని చేసే అధి కారము మనకు వుంది. నేను అలాచేయించాను, అని మనవి చేశాను. M.L.A. లకే కాదు ఆ హక్కు, ప్రతి మానవునికి వుందని తమ ద్వారా మనవి చేస్తున్నాను. ఆ సందర్భములో నలుగురి ఉపన్యాసములు అయిన తరువాత కలెక్టరు మాట్లాడారు. మా మీటింగులో M.L.A. లు ఉద్యోగస్థులను dismiss చేయిస్తామని చెప్పుకొన డము గొప్ప అనుకుంటున్నారు. ఈ M.L.A. లను కూడ dismiss చేసే అధి కారము మాకువుంటే బాగుంటుందని అన్నారు.

*Mr. Speaker*: There is a prima facie case. I shall send it to the Privileges Committee. ఉద్యోగస్థులు తప్పుచేస్తే dismiss చేసే అధికారము మనకుండాలి. మన తరపున ప్రభుత్వంవారు ఈ అధికారాన్ని అమలు జరుపుతారు. అయితే శాసనసభ్యులను dismiss చేసే అధికారము కూడా తమకు ఉండుట మంచిదని కలెక్టర్ వంటి బాధ్యతగల అధికారి చెప్పడం తప్పు దీనిలో prima facie case ఉన్నదని నేను నిర్ణయించి దీనిని Privileges Committee కి పంపుతున్నాను. దీని మీద ప్రభుత్వ మేమంటుంది ?

ఆర్థిక శాఖామంత్రి, (శ్రీ కె. బ్రహ్మానందరెడ్డి) : ఈ విషయములో ప్రభు త్వమునకేమీ సమాచారము అందలేదు. అది అట్లా ఉంచండి. ఇది విశాఖపట్ట ణము జిల్లాకు సంబంధించినది. ఆయన చాల అనుభవజ్ఞులు. Director of Agriculture చేసి చాల అనుభవము సంపాదించారు. "ఇటీవల విశాఖపట్టణం, శ్రీకాకుళము జిల్లాలలో వచ్చిన వరదల సందర్భములో అమోఘమైన, విశేషమైన సేవ చేశారని మన శ్రీ సాగి సూర్యనారాయణరాజుగారే కాకుండా పలువురు కొనియా డారు. అప్పుడు మనమంతా గర్వించాము. అటువంటి ఆయన "ఈ M. L. A. లను dismiss చేసే అధికారము మాకు వుంటే బాగుండునని" అన్నారు అంటే నమ్ముటకు వీలులేకుండా వుంది.

మిస్టర్ స్పీకర్ : వారు కోపముతో అన్నారేమో ?

శ్రీ కె. బ్రహ్మానందరెడ్డి : కోపము వచ్చినా వళ్లు మరచిపోయి మాట్లాడరని గ్రహించాలని నామనవి. M. L. A. లను dismiss చేయడానికి రాష్ట్ర ప్రభుత్వ మునకుగాని, కేంద్ర ప్రభుత్వమునకు గాని, భారత రిపబ్లిక్ నియమించిన

ప్రెసిడెంటుగాని అధికారంలేదు. ప్రభుత్వానికి ఈ విషయం తెలియ పరిస్తే వారిని అడగవచ్చు. ఈవిధముగా వారు అనలేదని ఇంకొక శాసనసభ్యుడు చెప్పుతున్నాడు. ఏమైయినప్పటికి ఒక ఆఫీసరును ఏదో presumptions తో ఇటువంటి పెద్ద సభలో విమర్శ చేయుట అంత న్యాయము కాదు ముఖ్యముగా services కు న్యాయముకాదు. వ్రాసిన సమాధానము తెప్పించుకొందాం. శాసన సభ్యులను విందాము. న్యాయము అనుకొంటే అప్పుడు విచారిద్దాము; లేకపోతే services కు చాల ప్రమాదకరమని మనవి చేస్తున్నాను.

డాక్టరు యం. చెన్నారెడ్డి (వికారాబాదు) :— అధ్యక్షా, ఈ విషయములో ఆర్థిక మంత్రిగారు చెప్పిన దానితో నేను ఏకీభవిస్తున్నాను. ఆ సభలో హాజరైన శ్రీరామమూర్తిగారికి వివరముగా చెప్పుటకు అవకాశము ఇవ్వాలని నేను కోరుచున్నాను. దీనిని refer చేయడము కూడ ధర్మముకాదేమో ననిపించుచున్నది. ఒక శాసన సభ్యుడు చెప్పిన దానికి ఎంత విలువ వున్నదో ఇంకొక శాసనసభ్యుడు చెప్పిన దానికి అంతే విలువ వుంటుంది. శ్రీరామమూర్తిగారు 1, 2 వాక్యాలు మాత్రమే చెప్పారు. వివరముగా చెప్పుటకు అవకాశమివ్వాలని కోరుచున్నాను.

శ్రీ రాజాసాగి సూర్యనారాయణరాజు :- ఆ కలెక్టరుగారు నేను అన్లా అనలేదు అని అంటే నేను withdraw చేసుకొంటాను.

శ్రీ రావినారాయణరెడ్డి (భువనగిరి) : ఆ కలెక్టరుగారి మంచి చెడ్డలు నాకు తెలియవు అనుకోండి. ఆ సభలో ఇద్దరు M. L. A. లు ఉన్నారు. ఒకరు privile e motion పెట్టారు రెండవవారు contradict చేస్తున్నారు. కలెక్టరు ఈ విధంగా అన్నాడు అంటే విశ్వసనీయముగా లేదు. చెన్నారెడ్డిగారు చెప్పిన దానితో నేను ఏకీభవిస్తున్నాను. ఇది ఆలోచించవలసిన విషయము. అందుచేత ఇది prima facic case అనే నిర్ణయానికి రాలేకపోతున్నాను.

*Mr. Speaker* : I am going to do this. I will refer this matter to the Government for taking the explanation of the Collector and disposing of the matter. ఆయన అనలేదని ఒకరు అంటున్నారు. 'Explanation' is correct. I have used a correct word. మన Members చాల ముఖ్యమైనవారే. Collector వద్ద నుంచి report తీసుకొని దీనిని dispose చేయండి.

శ్రీ వి. కూర్మయ్య (గుడివాడ) : Refer చేసి గవర్నమెంటువారే dispose of చేయమని చెప్పారు. refer చేసి ఇక్కడ discuss చేసి dispose of చేస్తే బాగుంటుందని నా మనవి.

శ్రీ పార్థసారథి (రాజంపేట). కలెక్టరు ఇంగ్లీషులో మాట్లాడారా, లేక తెలుగులో మాట్లాడారా ?

శ్రీ జి. లచ్చన్న : Dispose off చేయమని తమరు ప్రభుత్వానికి యిచ్చిన నిర్ణయానికి మేము బద్ధులమే. ఒక గౌరవ సభ్యుడు కలెక్టరు ఇలా అన్నాడని చెప్పినపుడు కలెక్టరు కాగితము మీద 'నేను ఇలా అనలేదు.' అని చెపితే నమ్మి విడిచి పెట్టుట న్యాయము కాదని, దాన్ని మంచి చెడ్డలు తెలుసుకొనుట సభయొక్క ధర్మమని నా ఉద్దేశ్యము. ఆ విషయాన్ని సభలో చెప్పినపుడు దానిలోని నిజానిజాలు తెలుసుకొని ఈ సభలోనే dispose of చేయడము ధర్మమని నా ఉద్దేశ్యము.

*Mr. Speaker*: The Government may inform the Assembly after they get the information.

శ్రీ బి. జి. ఎమ్ ఎ. నరసింగరావు (కళింగ) : ఈ motion మీద ఏ విధమైన నిర్ణయం చేయకుండానే. ప్రభుత్వానికి అప్పగించడం భావ్యంగాలేదు. ఒక నిర్ణయంచేసి తరువాత ప్రభుత్వానికి అప్పగిస్తే బాగుంటుంది.

మిస్టర్ స్పీకర్ : ఇద్దరు గౌరవ సభ్యులు భేదాభిప్రాయంలో ఉన్నారు. ప్రభుత్వం వారు దానిని oppose చేస్తున్నారు. I must now bring to the House. Best thing is to send to the Government. ప్రభుత్వం, వారికి చెబితే జాగ్రత్తగా ఉంటారేమో; ఎంత మంచి కలెక్టర్లు అయినా, ఎంత మంచి సెక్రటరీలయినా శాసన సభ్యుల విషయంలో జాగ్రత్తగా ఉండకపోతే ఎక్కడ Privilege Motion వస్తుందో నన్నభయం ఉండటం మంచిది. అందువల్ల ప్రభుత్వంవారు అడగటం, వారు చెప్పడం; ఆ భయం వారికి ఉండటం మంచిదని 'best thing is to send it to the Government' అంటున్నాను. ఆ పర్యవసానం తరువాత మీకు చెప్పవచ్చు.

శ్రీ డి. కోండయ్య చౌదరి : ఇందాక తమరు నేను ఏదో పొరపాటుగా members కన్నా correspondents కు ఎక్కువ ప్రాధాన్యం ఇవ్వాలంటున్నానని చెప్పడం, I never meant that. I wanted information whether a mere motion sent by the Member is enough or whether it is to be substantiated by other evidence. That is all my question. I never meant any disrespect to the Member or the House or meant that more weight should be given to the correspondents than to the Member.

మిస్టర్ స్పీకర్ : Members దగ్గర ఉంది తాము విన్నాము, చూచాము, అన్న తరువాత దానికి వేరే సాక్ష్యం ఏమీ అక్కరలేదు. అలా కాకుండా గౌరవ సభ్యులు స్వయంగా సాక్ష్యం యివ్వనప్పుడు ఏ పత్రికలో పడింది అనే విషయం కావాలి ఇది నా ruling. When a Member is present, when he sees, when he knows and gives the information, we have to take it as *prima facie* correct. In this case, unfortunately, another Member contradicts who is equally responsible and who is equally important to this Assembly. వారు అనలేదని, కోపంగా అంటున్నట్లుగా అర్థం చేసుకొన్నారని రెండవసభ్యుడు చెబుతున్నాడు. అందుచేత దానిని ప్రభుత్వానికి పంపించాను. వారు పరిశీలన చేస్తారు.

*Sri D. Kondaiah Chowdary* : Is it necessary? I never meant any disrespect. You asked me to withdraw. There is no question of withdrawing. I never meant...

*Mr. Speaker* : Thank you for your explanation.

శ్రీ పిల్లలమర్రి వెంకటేశ్వర్లు (నందిగామ) : Point of Order, Mr. Speaker, Sir, మన rules లో Privileges Committee కి ఒక issue riase అయిన తరువాత what are the courses open either to the Chair or to the House? This is the point we have to consider very seriously. మీఅంతట మీరుకాని లేక House తీర్మానంమీద కాని దీనిని Privileges Committee కి పంపవచ్చు. అలా కాకుండా ప్రభుత్వానికి మనం direction ఇస్తూ, మీరే ఆయనవద్ద explanation తీసుకొని, మీరే dispose of the matter అని చెప్పడం order and rules కు విరుద్ధంగా ఉంటుంది. ఈ particular case లో ఆ విధంగా చేస్తే మాకు వచ్చిన ఇబ్బందేమీ లేదు. General గా ఒక ప్రిసిడెంటును మనం చూస్తే, అదివ rule క్రింద అనేది ఎక్కడ కనిపించదు. కాబట్టి ఏదయినా మీరే dispose of చేయాలి. దీనిలో Privilege Motion ఉన్నదనుకొంటే, ఆ విధంగా చెప్పి Privileges Committee కి పంపండి లేదా House నిర్ణయానికి వదలదలిస్తే ఆ విధంగా చేయండి. Only those two courses are open on the Privilege Motion as far as the Rules are concerned. అలా కాకుండా ప్రభుత్వాన్నే explanation తీసుకోమని, వారి ఇష్టంవచ్చినట్లు చెయ్యాలని చెప్పడం ఏమీ బాగాలేదు. ఈ విషయంలో వారు వారు ఏకమైతే సరిపోతుంది. మిగిలిన

విషయాలు వచ్చేసరికి మాకు చిక్కు కలుగుతుంది. కాబట్టి తిరిగి పరిశీలన చేయువలసిందిగా మీ దృష్టికి తీసుకొని వస్తున్నాను.

మిస్టర్ స్పీకర్ వెంకటేశ్వర్లుగారు నిజమైన ప్రశ్న వేశారు. నాకు మినస్సులో ఆ విషయం తెలుసు. అయితే that means I have disallowed the Privil-ge motion and sent it to the Government for taking some action as they please. వారిని పిలిచి ఈ గొడవ ఏమిటని అడిగినట్లు వారు అనలేదని చెప్పినట్లు ఈ సభ్యునకు చెబితే సమస్య తీరిపోతుంది. అందుచేత I have disallowed the Privilege motion.

*Sri Vijaya Bhaskara Reddy* : When you disallow, the other thing does not arise at all.

*Mr. Speaker*: It may arise. It does not preclude.

## ADJOURNMENT MOTION RE:

*The Lathi-charge on the people of Raigir and the surrounding villages of Bhongir Taluq on 19-2-59.*

Now, there is an Adjournment Motion given notice of by Smt. Arutla Kamala Devi, namely:

"I move that business of the House be adjourned to discuss the following matter of urgent public importance:

"Unjust serious lathi-charge was made on men and women of Raigir and the surrounding villages of Bhongir Taluq by the police in the presense of local high officials at 11.00 A.M. on 19-2-1959. This has happened when the authorities tried to shift the hospital to another village established at Raigir village and serving the villages for the last one year. 30 persons have been injured out of whom 10 are women."

శ్రీమతి ఎ. కమలాదేవి : అధ్యక్షా, రాయిగిరి అనేది భోనగిర తాలూకాలో N. E. S. Block area క్రింద ఉన్న గ్రామము. అక్కడ దాదాపు ఒక సంవత్సరం క్రితం ఒక Health Centre పెట్టారు. దానిని అక్కడ, తాత్కాలికంగా మాత్రమే ఏర్పాటు చేశామని ఇప్పుడు చెబుతున్నారు. కాని, అప్పుడు ఏ ఉద్దేశ్యంతో ఏర్పాటు చేశారో మాత్రం తెలియదు. మొన్న 17వ తేదీ సాయంకాలం అకస్మాత్తుగా ఆ ఆసుపత్రిని అక్కడనుంచి వేరే గ్రామానికి మార్చాలనే

ఉద్దేశ్యంతో లారీని తీసుకొని వచ్చారు. ఆ విషయం తెలియగానే చుట్టుపక్కల పది గ్రామాల ప్రజలు ఆసుపత్రిచుట్టూ చేరి సామాను కదలనీయమని అటకాయించారు. ఆరోజున ఆ ప్రయత్నం మానివేశారు. నాకు తెలిసిన సమాచారం ప్రకారం డిప్యూటీ కలెక్టర్ ఆ ఆసుపత్రికి సీలువేసి ఉంచుతామని హైద్రాబాద్ వెళ్లి ఏదో పరిష్కారం చేసుకొని రావలసిందిగా చెప్పారట. కొంత మంది ముఖ్యులు హైద్రాబాద్‌కు వెళ్లడం జరిగింది.

ఈ సందర్భంలో ఒక్క విషయాన్ని మనం గమనించాలి. ఈ ఆసుపత్రిని అక్కడనుండి మోటకొండూరు గ్రామానికి మారుస్తున్నారు. అక్కడకు మార్చకూడదని నా ఉద్దేశ్యంకాదు. భోనగిరికి మూడు మైళ్లలోనే రాయిగిరి ఉండటం చేత ఇక్కడ యింకొక ఆసుపత్రి ఉండటం అనవసరమని ప్రభుత్వం భావించింది. కాని అక్కడి ప్రజలు దాదాపు సంవత్సరంనుంచి ఆ ఆసుపత్రివల్ల లాభం పొందుతున్నారు. డాక్టరు ఒక్కొక్కపూట స్థానికంగా ఉండి చికిత్సచేసి, రెండవపూట చుట్టు ప్రక్కల పదిగ్రామాలకు వెళ్లి రోగులను చూచి చికిత్సచేస్తున్నారు. స్త్రీలు, పిల్లలు చాలా లాభం పొందారు. చాలా ప్రమాదకరమైన కేసులు కూడా నయమయి, ఎంతో మందికి ప్రాణాలు దక్కాయి. అందువల్ల ప్రజలు ఒక mood లో ఉండి, ఆసుపత్రి కదలడానికి వీలులేదని పట్టుపట్టిన సందర్భంలో అక్కడి ముఖ్యులు హైద్రాబాద్‌కు వచ్చి శ్రీ వి. బి. రాజుతో పైరవీ చేస్తుండగా 19 తేది 11 గంటలకు పది గ్రామాల ప్రజలు గుమికూడి ఉండగా వారిపై లాఠిఛార్జీచేసి, ఆసుపత్రిని తరలించడం జరిగింది. ఆ గుమిగూడిన ప్రజలలో 500 మంది స్త్రీలుకూడా ఉన్నారు 30 మందిపైన లాఠిఛార్జి జరిగినట్లు చెప్పాను కాని, 50 మందిపై లాఠీఛార్జీ జరిగింది. అందులో 10 మంది వరకు స్త్రీలే ఉన్నారు. ఎంతోమంది పిల్లలస్త్రీల ప్రాణాలు ఆ డాక్టరు రక్షించుటచేత, ఆ ఆసుపత్రి ఇంకొక చోటకు పోతున్నదని తెలిసి, అక్కడవున్న చుట్టుప్రక్క గ్రామాల ప్రజలు మూగారు.

అక్కడ ఎక్కువమంది స్త్రీలు మూగి ఆసుపత్రిని పోనివ్వము అన్నారు ఆ సందర్భంలో వారికి నచ్చచెప్పి ఉంటే బాగుండేది. ఈ ఆసుపత్రిని ఇక్కడనుంచి తరలించినప్పటికి, మీకు మూడు మైళ్ళ దూరములో, భువనగిరిలో ఆసుపత్రి ఉన్నది. దానివల్ల ఉపయోగం పొందవచ్చు"నని ,అక్కడ ఉన్న అధికారులు చెప్పినట్లయితే. ప్రజానీకం తప్పకుండా వినేది. ఆ ఆసుపత్రిని అక్కడనుంచి మార్చి వేరే యింకో గ్రామంలో ఎక్కడైన పెట్టినట్లయితే, ఇంతకంటే ఎక్కువమందికి ఉపయోగం ఉంటుంది అనడంలో నిజం లేకపోలేదు. అట్లా మార్చినందుకు మా అభ్యంతరాన్ని చెప్పడం లేదు. కాని అక్కడ అధికారుల ఉద్దేశ్యం, ప్రభుత్వ ఉద్దే

శ్యాన్ని మాత్రం గుర్తించాలని కోరుతున్నాను. ఫలానా చేదిన ఆ దవాఖానాను ఎత్తివేయాలని అనుకొని పట్టుదలతో ప్రజలపై లాఠీఛార్జి చేసి తొలగించడం ఏమంత సమంజసముగా ఉన్నదో గ్రహించమని కోరుతున్నాను. శాంతియుతంగా "దవాఖానాను తీసుకొని వెళ్ళకూడదు" అని చెబుతున్న ప్రజానీకంపై లాఠీఛార్జీ జరిపారు. రాయగిర్‌లో ఉన్న డాక్టరు, ఏవిధంగా ఆ చుట్టు ప్రక్కల ఉన్న గ్రామాలు తిరిగి, అక్కడి ప్రజానీకానికి అందుబాటులో ఉన్నారో, ఆ విధంగానే, భువనగిరి డాక్టర్ రాయగిరికి కూడ వారానికి రెండు మూడు సార్లు వస్తారని ఆ ప్రజానీకానికి నచ్చ జెప్పినట్లయితే ఎంతో బాగుండేది. ఈ లాఠీఛార్జీ అవసరం లేకుండా ఉండేది. కాని ప్రభుత్వ అధికారులు, ఆ విధంగా నచ్చజెప్పడానికి ఎంతమాత్రం ప్రయత్నం చేయలేదు. లాఠీఛార్జీ చేశారు. 40 మందికి దెబ్బలు తగిలాయి. అందులో 10 మంది స్త్రీలు కూడ ఉన్నారు. వారు చాల తీవ్రంగా ఆ దెబ్బలకు గురిఅయ్యారు. తరువాత వి. బి. రాజుగారి దగ్గరకు వచ్చి వారితో చెప్పి దరఖాస్తు యివ్వడం కూడ జరిగినది. కాబట్టి ఈ విషయాన్ని చర్చకు తీసుకొని సభను వాయిదా వేయాలనినా ఉద్దేశము. ప్రభుత్వం ముఖ్యంగా, స్త్రీలపై జరిపిన ఈ అన్యాయాన్ని ఈ సభలో చర్చించాలని కోరుతున్నాను.

*శ్రీ ఆర్. నారాయణరెడ్డి : అధ్యక్షా! ఈ సంఘటన నా నియోజక వర్గంలోనే జరిగినది. అసలు రాయగిరిలో ఆ ఆసుపత్రి ఎందుకు వచ్చినది అనే సంగతి ఆలోచించాలి క్రిందటి సంవత్సరం ప్లాను క్రింద ఉన్న డబ్బు lapse అయిపోతున్నప్పుడు ఈ ఆసుపత్రిని అక్కడ పెట్టారు. గత పదకొండు మాసాల్నుగా ఆ హాస్పటలు అక్కడ ఉంటున్నది. ఎంతోమంది ప్రజలు దానివల్ల లాభం పొందారు. ముఖ్యంగా స్త్రీలు, ప్రసూతి కొరకు వచ్చిన వాళ్ళు చాల లాభం పొందుతున్నారు. దాదాపు ఒక సంవత్సరంనుండి ఉంటున్న ఆ ఆసుపత్రిని అక్కడనుంచి తరలిస్తాము అంటే, అక్కడి ప్రజలలో కొంత ఆందోళన బయలుదేరినది. అక్కడ నుంచి డాక్టరు ఇదివరకే వెళ్లిపోయాడు. ఇక మిగిలినది కుర్చీలు, బెంచీలు పది సీసాలు తప్ప యింకేమీలేవు. ఆ సమయంలో వచ్చిన ప్రజలు ఎంతో శాంతియుతంగా ఉన్నారు. కాని ఆఫీసర్లు చాల tactless గా ప్రవర్తించారని చెప్పకతప్పదు. పరిస్థితి చెయ్యిదాటి పోయే స్థితిలోకి రాకుండా, అక్కడ ఉన్నటువంటి మాలాంటివారి దృష్టికి తీసుకొని వచ్చినట్లయితే, మేము సర్దుబాటు చేసేవాళ్ళము. సామాన్యమైన పరిస్థితిలో ఆ విధంగా లాఠీఛార్జి చేయడం, అందులో స్త్రీలమీద చేయడం ఏమాత్రం బాగుగాలేదని మనవిచేస్తున్నాను. ఆ ఆసుపత్రిని అక్కడనుంచి తీసుకొని వెళ్ళకూడదని అడ్డుకున్న వారిలో ఎక్కువమంది స్త్రీలే ఉన్నారు. ఎందుచేతనంటే దానినుండి

ఎక్కువగా ఉపయోగం పొందినవారు ప్రజలు ఈ సందర్భంలో అక్కడి అధికారుల ప్రవర్తన విచారించి తగుగా చేయాలని మనవిచేస్తూ, adjournment ను allow చేయ వలసినదిగా కోరుచున్నాను.

శ్రీమతి ఎ. కమలాదేవి : అధ్యక్షా, ఈ సందర్భంలో ఇంకొక information చెప్పదలచాను. నేను నిన్ననే భువనగిరికి పోయివచ్చాను. అక్కడ పోలీసువారు, మొన్న లాఠీఛార్జీలో, ఎవరికైతే దెబ్బలు తగిలినవో వారిమీద కేసులు పెట్టుటకు ప్రయత్నిస్తున్నట్లు తెలిసినది. మొన్న జరిగిన లాఠీఛార్జీతో పోలీసు వారిలో ఎవరికి దెబ్బలు తగలలేదు కాని అక్కడ రూరలు పోలీసుస్టేషన్ S. I. రాఘవదాసు అనే ఆయన పోలీసుకానిస్టేబుల్సును లాఠీతో కొట్టి, ఈ దెబ్బలు రాయగిరి ప్రజలు కొట్టినట్లుగా, సర్టిఫికెట్టు డాక్టరుదగ్గరనుంచి తెచ్చుకోండి లేకపోయి నట్లయితే ప్రభుత్వానికి, సమాధానం చెప్పడం కష్టమవుతుందని అన్నట్లు సాక్ష్యం ఉన్నది. ఎందుచేతనంటే, ఆ సమయంలోనే భువనగిరిలో ఉండే ఒక అతను పోలీసుకస్టడీలో ఉండి, ఈ మాటలు S. I. అనడం, S. I కానిస్టేబుల్సును కొట్టడం మొదలైనవి అన్నీ చూచాడు. కావలసివస్తే ఆ సాక్ష్యం యిప్పిస్తాము. కేసులు బనాయించాలని ఈవిధంగా చూస్తున్నారు నిజంగా అక్కడ పోలీసువారికి ఎవరికి, దెబ్బలు తగలలేదు. అంతేకాకుండా ఈ విషయం అంతా వి. బి. రాజు గారితో చెప్పుకోడానికి, పైరవీ చేయడానికి కొంతమంది హైదరాబాదు వస్తే, వారి మీద కూడా కేసులు పెట్టడానికి ప్రయత్నిస్తున్నట్లు తెలిసినది.

* శ్రీ కె. బ్రహ్మానందరెడ్డి : అధ్యక్షా! ఇంతవరకు ఇటువంటి అడ్జర్న మెంటు మోషన్ ఉన్నట్లు నాకు తెలియదు. అయినప్పటికి ఏమి తెలియపరచిన విషయాలు ఒకదానితో మరొకటి contradictory గా ఉన్నాయి. రావి నారాయణ రెడ్డిగారు మాట్లాడుతూ "ఆసుపత్రిలో డాక్టరేలేడు 10 సీసాలే ఉన్నాయి" అని అన్నారు. అంత చిన్నదానికి ఆడవాళ్లు కూడ వచ్చి గలభా చేయవలసిన అవసరం ఏమి ఉన్నదో నాకు అర్థం కావడంలేదు. చెప్పేవిషయాలు, ఒక దానితో మరొక టికి సంబంధం ఉంటే బాగుంటుంది. కమలాదేవిగారు, అక్కడనుంచి ఆసుపత్రిని మార్చి నట్లయితే ఇంకా ప్రయోజనం ఉంటుందని ఒప్పుకున్నారు. ఆ మార్పులనే నిర్ణయం కూడ ఎప్పుడో జరిగి ఉంటుంది. తరువాత దెబ్బలు తగిలినవారు వి. బి. రాజుగారి దగ్గరకువచ్చి పైరవి చేస్తున్నారని ఆవిడ చెప్పినారు. ఆ పైరవీ అన్నది వారేచేస్తున్నారో లేక వి. బి. రాజుగారే చేస్తున్నారో అర్థం కాకుండా ఉన్నది.

*Mr. Speaker* : I now understand that the matter comes within the purview of the hon. Chief Minister. So, I shall post it to the day after tomorrow morning. Let the hon. Chief Minister get the information meanwhile and tell us something. So, it is adjourned to the day after tomorrow, i. e., 26th February, 1959 to hear the Government reply.

## BUSINESS OF THE HOUSE

*Mr. Speaker*: నాగార్జునసాగర్ గురించి లేబరు మంత్రిగారు చెప్పినట్లయితే సరిపోతుందికదా ;

*Sri K. Brahmananda Reddy*: I un-officially learn that the strike has been withdrawn, subject to correction.

*Mr. Speaker*: To-morrow, we shall hear from the hon. Labour Minister.

*Sri G. Latchanna*: Sir, what about the notice given by me under Rule No. 74 regarding wet assessment?

మిస్టర్ స్పీకర్ ; రేపు.

శ్రీ కె. బ్రహ్మానందరెడ్డి : రేపు కూడ కలెక్టర్ల కాన్ఫరెన్సు ఉన్నది. కాబట్టి, ఎల్లుండి అయితే బాగుంటుంది.

మిస్టర్ స్పీకర్ : ఎల్లుండి తప్పకుండా చెప్పేటట్లు కష్కొంటాను.

## PAPERS LAID ON THE TABLE OF THE HOUSE

### *G. O. Ms. No. 293, Revenue dated 10-2-1959 relating to the recommendations of the Village Officers Enquiry Committee*

*Sri K. Brahmananda Reddy (Deputising for Sri K. Venkata Rao)*: Sir, I beg to lay on the Table a copy of G. O. Ms. No. 293, Revenue dated 10-2-1959 relating to the recommenations of the Village Officers Enquiry Committee and the orders of the Government passed thereon."

*Mr. Speaker*: Paper laid on the Table.

# BUSINESS OF THE HOUSE

మిస్టర్ స్పీకర్ : ఇప్పుడు ఇక general discussion on the annual financial statement. రేపటి నుంచి అసెంబ్లీ ఉదయం 8-30 నుంచి 1-30 గంటల వరకు ఉంటుంది. ఎందుచేతనంటే, రోజుకు 5 గంటల చర్చ ఉండాలి. అది సభ్యుల యొక్క హక్కు కాబట్టి 5 గంటలు చర్చ రోజుకు అవసరం. ఈ 5 రోజుల్లో 4 రోజులు అన్ని విషయాల మీద మాట్లాడ వచ్చును. దీనికి ఆర్థిక మంత్రి గారు 27వ తేదీన జవాబు యిస్తారు. 28వ తేదీన ప్రధానంగా పేకమీషన్ మీద చర్చ జరుగుతుంది. ఆ చర్చపై కూడా 28వ తేదీన జవాబు చెబుతారు.

శ్రీ కె. బ్రహ్మానందరెడ్డి : గౌరవ సభ్యులు ఏ రోజున దానిని గురించి మాట్లాడినా నాకు అభ్యంతరములేదు నాకు సంబంధించినంత వరకు 28వ తేదీ నాడు మీరు ఒక గంట ఇచ్చినా ఒకటిన్నర గంటలు యిచ్చినా పే కమిటీ రిపోర్టును గురించి బడ్జటు సాధారణ చర్చకు సంబంధించిన ఇతర విషయాలను గురించి సమాధానం చెబుతాను. 27వ తేదీన ఒక పర్యాయం, 28వ తేదీన ఇంకొక పర్యాయం చెప్పనక్కర లేదనుకుంటాను.

శ్రీ రావి నారాయణరెడ్డి : అన్ని విషయాలను గురించి 28వ తేదీనాడే జవాబు చెబుతానని మంత్రిగారు అంటే పే కమిటీ రిపోర్టుపై చర్చకు ప్రాధాన్యత పోతుంది. అందుచేత 27వ తారీఖున బడ్జెటుకు సంబంధించిన విషయాలకు జవాబిచ్చి 28వ తేదీని పూర్తిగా పే కమిటీ రిపోర్టుపై చర్చలకు వదిలితే బాగుంటుంది.

మిస్టర్ స్పీకర్ : బిజినెస్ ఎడ్వయిజరీ కమిటీ సమావేశంలో యీ విషయాలన్నీ ఆలోచించు కుంటాము. శ్రీ రావి నారాయణరెడ్డిగారికి 40 నిమిషాలు ఇస్తాను.

శ్రీ షేక్ మౌలానా సాహెబ్ (ఉదయగిరి) : ఈ రోజు ఫ్లోర్లీడర్ వారికి 10 నిముషాలు, 2 నిమిషాలు అని చెప్పేబదులు సభ్యులందరకు సమానంగా టైము ఇచ్చినట్లయితే అందరకు సమాన అవకాశముంటుందని మనవి చేస్తున్నాను.

మిస్టర్ స్పీకర్ : ఆ విధంగా చేయడానికి వీలుండదు. ప్రతిపక్షముల నాయకులకు హెచ్చు సమయం యీయవలసి ఉంటుంది. వారు తమ పార్టీ వారందరి తరఫున మాట్లాడుతారు. ఇతర గౌరవ సభ్యులు వారి వారి నియోజక వర్గాలకు సంబంధించిన విషయాలను గురించి మాట్లాడుతారు. అంతేకాక సబ్జక్టు బాగా తెలిసిన [illegible]

# GENERAL DISCUSSION ON THE BUDGET FOR THE YEAR 1959-60

శ్రీ రావి నారాయణరెడ్డి: అధ్యక్షా, ఆర్థిక మంత్రిగారు ప్రవేశపెట్టిన బడ్జటు చాలా అసంతృప్తికరంగాను ప్రజలకు నిరుత్సాహకరంగాను ఉన్నది. బడ్జటును ప్రతిపాదించే విషయంలో మంత్రిగారు పన్నులను గురించి ఒక క్రొత్త టెక్నిక్ అవలంభించినారు. వీరేకాదు వెనుకటి ఆర్థికమంత్రి శ్రీ గోపాలరెడ్డిగారు కూడా ఇదే టెక్నిక్‌ను అవలంభించారు.

సాధారణంగా బడ్జటు ప్రసంగంలో వచ్చే సంవత్సరంలో విధించబోయే పన్నులేవో పేర్కొనవలసి ఉంటుంది. ఆ విధంగా చేయకుండా బడ్జటును ప్రతిపాదించుటకు కొద్ది రోజులు ముందు పన్నుల విధింపు సంబంధించిన బిల్లులు ప్రవేశపెట్టడం, వాటిని అసెంబ్లీవారి ఆమోదాన్ని పొందడం జరుగుతుంది. ఆ తరువాత బడ్జటును ప్రవేశపెడతారు. దానిలో కొంత లోటు చూపిస్తారు. ఆ లోటును భర్తీ చేయటానికి ఏదైన మార్గం అన్వేషించవలసి వుంటుందని చెబుతారు. ఈ లోటులను పురస్కరించుకొని పత్రికలు కూడా ప్రభుత్వం క్రొత్త పన్నులను విధించవలసి లేదని వ్రాస్తాయి. ఈ క్రొత్త పద్ధతివల్ల ప్రజలను మభ్యపెడుతున్నారు.

బడ్జటు ప్రసంగంలో వచ్చేసంవత్సరంలో చేయబోయే కార్యక్రమాలను గురించి చెప్పడం పరిపాటి. ఈనాడు భూసంస్కరణలు అత్యంత ప్రాధాన్యమైనవని మనమందరకు తెలుసు. అయితే ఆవిషయంలో ఏమిచేయదలచుకొన్నది స్పష్టంగా బడ్జెటులో లేదు. నాగపూరులో జరిగిన కాంగ్రెస్ సమావేశాలలో భూసంస్కరణలకు ప్రాధాన్యత యీయవలెనని చెప్పారు. ఒక బిల్లు సెలెక్టు కమిటీవారి ఎదుట ఉన్నదికూడా. అయితే వచ్చే సంవత్సరం యీ భూసంస్కరణలను ఏ స్వరూపంలో ప్రవేశపెడతారు? అసలు ప్రవేశపెడతారా, లేదా అనే విషయం మంత్రిగారి ఉపన్యాసంలో కంచుకాగడా వేసివెతికినా కనపడదు.

అయితే శ్రీ అనంతరామన్ కమిటీ నివేదిక గురించి ఉదహరించబడినది. బహుశః ఈ నివేదిక వల్ల ప్రభుత్వానికి అదనంగా కొంతడబ్బు రావచ్చు ఏది ప్రజలకు ఉపకరించే విషయమేమీలేదు ఆ నివేదికలో.

సాధారణంగా బడ్జటు ప్రసంగంలో రాష్ట్ర ఆర్థిక పరిస్థితి, ఇన్నేళ్లుగా ప్రణాళికలను అమలు జరిపినందువల్ల సాధించిన ఫలితాలు సమీక్ష, రాబోవు సంవత్సరంలో కొనసాగించే కార్యక్రమ వివరాలు ఉండాలి. అయితే మన ఆర్థిక మంత్రిగారి బడ్జటు ప్రసంగంలో కేవలం అంకెల గారడీగానే కనిపిస్తున్నది. ఏదో కొంత ఎక్కువ ఖర్చుచేయదలచాము. పెట్టుబడి ఖర్చు హెచ్చుగా ఉంటుంది. అట్లా చెప్పినంత మాత్రాన ప్రజాబాహుళ్యానికి అవి చాల ఉత్సాహజనితము కాజాలవు. ప్రజా

ధనం ఏవిధంగా ఖర్చుచేయబడించినారో ప్రజలు, ప్రజాప్రతినిధులు కూడా చూస్తున్నారు. బడ్జెటును తయారు చేస్తున్నప్పుడు వేసిన ప్లానులు ప్రకారంగా కార్యక్రమాలు జరుగుటలేదు. ప్రభుత్వంవారు ప్రచురించిన పుస్తకములలోని వివరములను బట్టి నేను సేకరించి సమాచారాన్ని సభవారికి మనవిచేస్తాను.

| | 1956–57 | | 1957–58 | |
|---|---|---|---|---|
| ఎగ్రికల్చరల్ ప్రోగ్రామ్సు | 47.87 | శాతము | 68.90 | శాతము |
| ఇర్రిగేషను అండ్ పవర్ | 84.00 | ,, | 106.00 | ,, |
| ఇండస్ట్రీస్ | 54.50 | ,, | 63 20 | ,, |
| ట్రాన్స్పోర్టు | 50.40 | ,, | 57 00 | ,, |
| సోషల్ సర్వీసెస్ | 79.20 | ,, | 75.00 | ,, |
| మిసలేనియస్ | 25.32 | ,, | 8.00 | ,, |

ఈ అంకెలను చూచినట్లయితే ఎంతో డబ్బు లాప్సు అయినట్లు కనిపిస్తుంది. 1957–58 సంవత్సరానికి సంబంధించి ఇర్రిగేషను అండు పవరు పద్దు క్రింద 106 శాతం ఖర్చుచేశారు.

ఈ విధంగా ఎందుకు జరుగుతుంది? ఈ విధంగా lapse అయ్యేందుకు కారణం ఏమిటి? Plans వేస్తారు, వాటికి budget provide చేస్తారు. కాని అదంతా lapse అయిపోతున్నది. దీనికి కారణం, ప్రభుత్వంయొక్క Departments కుళ్ళిపోయినాయని మనవి చేస్తున్నాను.. Departments సక్రమంగా పనిచేయడం లేదు ఇప్పుడే మన Bureau of Economics and Statistics వారు దీనికి కారణం చూపించారు. ఈ Departments తొమ్మిది మాసాలు నిద్రపోతున్నాయని చెప్పారు. Correspondence లో incorrigible red-tapism విపరీతంగా ఉండడమువల్ల 8 మాసాలు నిద్రపోయి, ఆ 3 మాసాలు మేలుకొని అప్పుడు ఖర్చులు విపరీతంగా పెట్టడము ఆరంభిస్తారు. కాని అది పూర్తిచేయజాలుతారా అంటే, చేయలేరు. 50% 9 మాసాలలో అమలు జరిపితే, మిగతా 50% 3 మాసాలలో అమలు జరపాలని చూస్తారు. దాంట్లో లంచగొండితనము, mis-appropriation అంతా జరుగుతుంది. లేకపోతే అంతడబ్బు మూడు మాసాలలో ఏ విధంగా సక్రమంగా ఖర్చుపెట్టగలరు?

ఇక Planning ఏ విధంగా అమలు జరుగుతున్నదని చూచినప్పుడు, దాంట్లో డబ్బు ఏ విధంగా దుర్వినియోగం చేయబడుతున్నదో, ఏ విధంగా అపహరింపబడుతున్నదో, నా అనుభవంనుంచి చాలా ఉదాహరణలు ఇచ్చే అవకాశాలు ఉన్నాయి.

ఏ విధంగా Planning డబ్బు వృధాగా అయిపోతున్నది, ఏ విధంగా డబ్బు ఖర్చు చేస్తున్నారు, అనే దాన్ని గురించి Estimates Committee report లో కొన్ని extracts చదివివినిపిస్తాను. అదే విధంగా మా అనుభవంలో కూడా చాల చెప్పగలను. మన కళా వెంకటరావుగారు ప్రశ్నల సందర్భంలో ఒక విషయం చెప్పారు. మా తెలంగాణాలో రాపీ campaign అని తీసుకొన్నారు ... compaign లో ఎరువులు ఇస్తామని సప్లయిచేశారు. ఆ సందర్భంలో red-hand గా పట్టుబడిన ఉదాహరణలు ఉన్నాయి. రైతుల పేరుతో black-market లో ఈ ఎరువంతా పోయింది. దొంగసారాయి చేసేందుకు ఎక్కడనుంచి ఆంధ్రజిల్లాలకు పంపెంచిన ఉదాహరణలు ఎన్నయినా చెప్పజాలుదాను. బావులకుగాను యిచ్చే grants, అందుకొరకు వినియోగిస్తున్నారా ? అదే విధంగా irrigation కొరకు యిచ్చే డబ్బు. అక్కడ engineers, contractors యొక్క pockets ను irrigate చేసేందుకు పోతూ ఉంటుంది అటువంటి విషయాలన్నీకూడా మంత్రిగారు ఆత్మవిమర్శన చేసుకొని, దాంట్లో ఇవన్నీ ఈ విధంగా సవరిస్తామని వ్రాసి ఉంటే చాలా బాగుండేది. మంత్రిగారు ఇదంతా feel రాకుండా సంఖ్యను మాత్రము చూపి మమ్ములను సంతృప్తి పరచటానికి చూస్తున్నారు Irrigation projects లో జరిగే అవకతవకలు గూర్చి నేను ఎక్కువగా చెప్పవలసిన పని ఏమీలేదు. K.C. Canal కు సంబంధించి, నేనుకూడా Estimates Committee లో సభ్యుడుగా ఉండి ఆ విషయాలన్నీ తెలుసుకొన్నాను. అకమిటీ report సభముందు పెట్టబడింది. దాన్ని గురించి ప్రభుత్వము ఏమి చర్య తీసుకొన్నది ఇంతవరకు చెప్పలేదు Cement సంబంధించి ఆ విషయాలు అన్నీ వచ్చాయి. ఆ సిమెంటు అంతా black-market లోకి పోయింది. దొంగతనంగా అమ్ముకొన్న వాళ్ళు చాలా అమ్ముకొన్నారు. కర్నూలుకు సంబంధించిన ఇద్దరు M.L.A.లు దాంట్లో సాక్ష్యముకూడా ఇచ్చారు. ఆ కమిటీ ముందర సిమెంటు concrete lining ఏ విధంగా ఉండాలో దానికొక proportion ఇచ్చారు. ఆ proportion 1 : 4:8 ఉండాలని చెప్పారు. ఆ cement concrete lining సరియైన proportion లో ఉండి చాలా strong గా ఉండాలన్నారు. ఇది ఏ విధంగా ఉన్నదో చూచుటకు ఆ కమిటీసభ్యులు అక్కడకు వెళ్ళి చూశారు. కాని అది ఒక సామాన్యమైన మన్ను లాగ ఉంది 1 . 4 : 8 proportion అనేది లేదు. యదార్థమేమిటంటే, అక్కడ ఉన్నటువంటి సిమెంటు అంతా కూడా వెళ్ళిపోయింది. దానికి సంబంధించిన extracts నేను ఈ House ముందు చదివి వినిపిస్తాను—

The quality of work as far as these napa slabs are oncerned has also not been very satisfactory ... Even the

Special Chief Engineer in his evidence has very clearly stated that the work of the napa slabs has been most unsatisfactory.

* * *

A margin of 20 per cent between the tenders accepted in the first year and those accepted in the second year goes to prove that the estimates made by the Department have little basis to stand upon.

* * *

At three different stages, different and conflicting information was given to the Committee which could have been avoided....... The Committee had to adjourn several times in order to get correct information.

* * *

The conclusion to which the Committee was forced to come was that it was mainly due to the poor quality of work shown on the spot, and to the fact that cement in large quantity was easily available in the market during the construction period of this canal, and that this question requires thorough probe and also requires some suitable steps to check it.

* * *

The Committee failed to understand that when nearly half a dozen of these persons were present on the occasion of mixing in the required proportion of the cement how could cement bags in abundance be available in the market and the quality of work so poor.

—ఇది K.C. Canal కు సంబంధించినటువంటి విషయం ఈ మధ్యనే కడం ప్రాజెక్టు wash-out అయిపోయింది. ఎందుకొరకు wash-out అయిపోయిందో దానికి సంబంధించిన ఒక extract మాత్రము చదివి వినిపిస్తాను—

The Committee feels that the Department has definitely gone wrong in granting the contract to an individual for the construction of the dam which involves a huge amount without calling for tenders and arbitrarily fixing not only the Luxettipet rates but also giving 170 per cent extra over the D. S. R.

ఆ project workout అయిపోయిన దానికి అదే కారణం. అప్పుడు ప్రభుత్వంలో ఉండే మహాశయులు దయాదాక్షిణ్యాలు చూపించి ఆ ముఖ్యమైన సట వంటి dam అంతా ఒక్కరికే ఇచ్చి అందులో విపరీతమైన rates ఇచ్చినా కూడా దానికి supervision లేకపోయి ఉండాలి. అతడు డబ్బు బాగా సంపాదించి ఉంటాడు. కనుకనే అది washout అయిపోయింది. ఇది యదార్థమైన విషయం.

*[Srimathi T. Lakishmi Kanthamma in the Chair]*

ఇక ప్రభుత్వంలో డబ్బు ఏవిధంగా ఖర్చు అవుతున్నది, ఎక్కువగా ఎక్కడ ఖర్చు అవుతున్నది, అనే విషయం గురించి, ఇదివరకే నేను చాలా ఉపన్యాసాలలో మనవి చేశాను. గవర్నరు కొరకు, మంత్రుల కొరకు ఎంతో డబ్బు ఖర్చు చేస్తున్నారు. దాన్ని గురించి ఎక్కువ వివరాలలోకి వెళ్లదలచుకోలేదు కాని ఆ లెక్కలుబట్టి చూస్తే ఆ ఖర్చు కొద్దిగా పెరిగినట్లే కనిపిస్తున్నది గాని తగ్గినట్లు కన్పించడంలేదు. అదేవిధంగా సెక్రటరీలకు వేలకొలదీ జీతాలు ఉన్నాయి. ఈ బడ్జెట్ లో ఒక విషయం చూపించిఉంటే బాగుండేది. మొత్తం services కొరకు, ముఖ్యంగా Gazetted Officers కు ఎంత ఖర్చు అవుతున్నదో దీంట్లో చూపిస్తే బాగుంటుంది దీనిలో అవన్నీ వెతుక్కోవడం చాలా కష్టంగా ఉంటుంది మా అంచనాల ప్రకారం, వీరి కొరకు 24, 25 కోట్ల రూపాయలు అయిపోతున్నదని తెలుస్తున్నది. అందుచేత మంత్రిగారు ఈ బడ్జెటును ప్రవేశపెట్టి దీనివలన ప్రజలు ఉత్సాహపడుతారని, దీనివలన దేశానికి ఏదో లాభం కలుగుతోందని, మంత్రిగారి ఈ ఉపన్యాసానికి ప్రజలు స్వాగతమిస్తారని అనుకోవడం చాలా పొరబాటు. ఇతర విషయాలను గురించి ఆలోచిస్తే ఈనాడు పరిపాలనా విధానం చాలా అధ్వాన్న పరిస్థితులకు వచ్చింది. ఇప్పుడే ఒక కలెక్టరుకు సంబంధించి ఒక కేసు వచ్చింది. దానిని బట్టి మంత్రులు ఏవిధంగా, అధ్వాన్న పరిస్థితులు కల్పిస్తున్నారో క్రింది అధికారులపైన వొత్తిడిచేసి, అందులో వారుకూడా భాగస్వాములై ఏవిధంగా అన్యాయంగా పనులు చేసుకొంటున్నారో తెలుస్తుంది. వారి పార్టీని బలపచడానికి విపరీతంగా కృషిచేస్తున్నారు. ప్రతి M. L. A. కూడా తన నియోజకవర్గంలో తాను Chief Minister అనో Prime Minister అనో అనుకొంటాడు. వారికి అధికారులంటే నిర్లక్ష్యం. ఇక మంత్రుల ఉపన్యాసాలయితే హద్దుపద్దు లేకుండా పోతాయి. మన మిత్రుడు ముఖ్యమంత్రిగారు ఎక్కడో మాట్లాడిన దాన్ని గురించి High Court ruling ఈ విధంగా ఉన్నదని చెప్పారు. మా పార్టీ వారు ఏదైనా, తీసుకొనివస్తే అంగీకరిస్తాము కాని opposition వారు, ఇతరులు ఏదైనా తీసుకొనివస్తే అంగీకరించలేమని ముఖ్యమంత్రిగారు చెప్పిన దానికి High

Court అనుకూలంగా తీర్పు ఇచ్చారని చెప్పారు ఆ High Court decision ఈ House ముందు పెడితే బాగుంటుందని మనవిచేస్తాను. కాని నాకు తెలిసినంత వరకు ఆ విధంగా చెప్పలేదు. "Chief Minister అంతటి గొప్పవాడు ఈ విధంగా అని ఉంటాడంటే" అని హైకోర్టు తీర్మానంలో ఉన్న వరకు నాకు తెలిసిన information. నా మిత్రుడు అయ్యపరెడ్డి ఆ High Court ruling తీసుకువచ్చి ఇక్కడ పెడితే నేను సంతోషిస్తానని మనవి చేస్తున్నాను. ఎన్నో ఉదాహరణలు మీకు యివ్వగలను అధికార పక్షంవారు, చేసే interference వల్ల స్థానిక సంస్థల పరిస్థితులు చాల అధ్వాన్నంగా ఉన్నది. ఎన్నికలలో కమ్యూనిస్టుపార్టీ ఎన్నుకోబడుతుంది, మెజారిటీ వస్తుంది కాని అధికారులు ప్రభుత్వ పక్షంవారి చెప్పు చేతలలో ఉంటారు. కనుక అధికారులచేత ఒక టెక్నికల్ మిస్టేక్ చేయిస్తారు. కంభం మేజర్ పంచాయితీ విషయం ఉన్నవి. అక్కడ అధికారిచేత ఒక mistake చేయిస్తారు. Co-option కు సంబంధించి రమ్మనమని ఆ పంచాయితీ ఆఫీసరు నోటీసు యిస్తాడు. క్లార్కును పంపిస్తాడు—తాను మాత్రం రాడు. ఈ విషయంలో నేను సాక్ష్యం యివ్వగలను. ఇది అంతా లోకల్ కాంగ్రెసు వారుల యొక్క మంత్రుల ఆశీర్వాదముతో జరుగుతుంది. దానిపైన అక్కడ technical mistake commit చేస్తారు. Co-opption అనే దానిలో అక్కడ clerk కు అధికారం ఉండదు. ఈ కారణాలవల్లనే అక్కడ మా పార్టీకి మెజారిటీవచ్చి రెండు సంవత్సరములయినది.

శ్రీ కె. బ్రహ్మానందరెడ్డి : దాని విషయం కోర్టులో ఉన్నదా?

శ్రీ రావి నారాయణరెడ్డి : Court decisions అయిపోయినవి. ఇది రద్దు కావాలని చెప్పారు మీ ప్రయత్నం ఫలించింది. ఎన్నుకోబడి రెండు సంవత్సరములు అయినప్పటికీ, అధికార పక్షంవారు అవలంబించిన వైఖరివల్ల, interference వల్ల, అది function చేయలేదు. తిరిగి ఎన్నికలు జరుగుతాయి.

నా దృష్టికి యింకొక కేసు వచ్చినది. అది కోర్టులో లేదు. సూర్యాపేటలో ఒక గ్రామ పంచాయతీ అధ్యక్షుడు చనిపోయాడు. ఉపాధ్యక్షునికి ఛార్జి యిస్తారు. అధ్యక్షుని ఎన్నికకొరకు తహశీల్దారు వస్తాడు. చనిపోయిన అధ్యక్షుడు మా పార్టీకి సంబంధించిన వాడు, ఉపాధ్యక్షుడు కాంగ్రెసు వాడు. తాశీల్దారు వచ్చి, ఎవరి ప్రేరేపణవల్ల చేశాడోగాని, అధ్యక్షుని ఎన్నికలు జరిపించడములో పొరపాటు చేసి ఉంటాడు. అక్కడ తెలంగాణా గ్రామ పంచాయతీల చట్టం ప్రకారం ఇద్దరు నామినేటెడ్ సభ్యులు ఉన్నారు వారికి ఓటింగ్ అధికారం ఉన్నా యివ్వరు. అధికారం ఉపాధ్యక్షుడు హస్తగతం చేసుకున్నాడు. హైదరాబాదుకు మంత్రుల వద్దకు వద [illegible] టెక్నికల్ పొర

able to fully utilize this provision within this year and that our Engineers and the concerned departments will not allow even a single pie to lapse, and from the beginning of the financial year itself their activities, such as calling for tenders, etc. would start.

The budget shows improvement in many fields. So far as Telangana is concerned, we are happy that the estimates are prepared in a good way. We have seen progress everywhere in the villages and There is progress in the educational field. The food situation also has improved. Therefore, Sir, I heartily support the budget presented by the hon. Finance Minister. And I hope that the provisions in the budget would be utilized fully within this year and our Government under the able leadership will take our State to better prosperity on par with other States of India. Thank you.

శ్రీ యస్. పి. శేషాద్రి :- (రాయదుర్గము) అధ్యక్షా, అర్థిక మంత్రిగారి బడ్జెట్ ఉపన్యాసంలో కొన్ని omissions వున్నప్పటికి saleint features కూడా చాల వున్నవని చెప్పడానికి నేను చాల సంతోషిస్తున్నాను. వారు తమ ఉపన్యాసంగము లో ఆంధ్ర ప్రదేశ్ ఏర్పడినప్పటినుంచి మన రాష్ట్రము ఎదుర్కొంటున్నటువంటి సమస్యలను వివరిస్తూ వాటిని ఏవిధంగా పరిష్కారము చేయడానికి ప్రభుత్వము తీవ్రమైన ప్రయత్నాలు చేసినదనే విషయాన్ని వారిందు చర్చించినారు. మన కున్న సమస్యలు పూర్తిగా యీ రోజు పరిష్కరింపబడక పోయినప్పటికి అధిక భాగము సంతృప్తికరముగనే పరిష్కరించినామని చెప్పుకోవచ్చును.

ఈ సందర్భములోనే మొన్న మొన్ననే pay committee ని ఒక దానిని constitute చేసినారు. ఆ pay committee సిఫార్సులు unanimous గా మెంబర్లందరు కూడా ఒప్పుకున్నారు. దానిని మన ప్రభుత్వము కూడా ఒప్పు కొన్నది. అయినప్పటికీ ఎందుచేతనో యీ pay committee సిఫార్సులు తీవ్రమైన అసంతృప్తిని Non-Gazetted ఉద్యోగస్థులలో కలుగజేసినది. డాక్టర్లు, ఇంజనీర్లు, వెటర్నరీ డాక్టర్లు, అగ్రికల్చర్ డిపార్టుమెంటులో పనిచేసే ఉద్యోగస్థులు తప్ప మిగిలిన Non Gazetted ఉద్యోగస్థులు తమ తీవ్రమైన అసంతృప్తిని తెలియజేసినారు. ఎందుకంటే చాల catagories లో వారి జీతాలు పెరగకపోగా వారి starting pay తగ్గడము మనకు కన్పిస్తున్నది. Starting pay తక్కువచేసి వాండ్లకు retiring stage లో ఎక్కువ వుండేటట్లుగా యీ pay committee సిఫార్సు చేసినది.

Pay Committee ని ఏర్పాటు చేసేటప్పుడు non- gezetted ఉద్యోగస్థులకు కూడ representation ఇచ్చిన యెడల ప్రభుత్వము ఈ రోజున ఎదుర్కొంటున్న విమర్శలకు తావులేకుండా వుండేది. దీనికిగాను 3 కోట్లు ఖర్చు అవుతుందని బడ్జెటు ఉపన్యాసములో మంత్రిగారు చెప్పారు. ఇందుకుగాను 1959-60 లో 3 కోట్లు కేటాయించాలని చెప్పారు. కాని ఉద్యోగస్థులు మాత్రము "3 కోట్లు అవడానికి అవకాశములేదు ఈ లెక్కలు తప్పు" అని చెప్పుతున్నారు. మంత్రిగారి బడ్జెటు ఉపన్యాసములోనే ఈ విషయం గురించిన వివరాలు వుంటాయని ఆశించాము. కాని జవాబులోనైనా చెపితే ఈ సందేహాలకు తావులేకుండా పోతుందని నేను భావిస్తున్నాను.

నానాటికి మన రాష్ట్ర ఆదాయము పెరుగుచున్నది. ఖర్చులుకూడ పెరుగుచున్నవి. ఏమయినప్పటికి ప్రజలలో ఏదో కొంత అసంతృప్తి కనుపిస్తున్నది. దీనికి ముఖ్యమైన కారణాలు రెండు వున్నవి. మొదటిది పన్నులవిధానము, రెండవది పరిపాలనా దక్షత, పరిపాలన శక్తిని చూస్తున్నాము. రోజు రోజుకు efficiency తగ్గిపోతున్నట్లుగా కనుపించుచున్నది. Papers త్వరగా move కావడంలేదు, పరిష్కారము కావలసిన సమస్యలు త్వరగా పరిష్కారము కావడములేదు. ప్రభుత్వము యొక్క పొదుపు ఉద్యమములోని ఉద్దేశ్యమేమిటో అర్థము కాకుండా వున్నది. ప్రభుత్వ ఆఫీసులలో సామర్థ్యాన్ని పెంచడము, ఖర్చులలో దుబారాను నిలుపుదల చేయడము మొదలగు విషయాలను గురించి ప్రభుత్వం ఆలోచిస్తోందని చెప్పారు. అది సంతోషించదగిన విషయమే ఈ పొదుపు సంఘము మన రాష్ట్రములో సామర్థ్యాన్ని పెంచు ఏర్పాటు చేయగలిగితే మనము ఖర్చు పెడుతున్న డబ్బు సరిగా ఖర్చు అయినట్లుగా భావించవచ్చును.

పన్నుల విధానము వుంది. వేరుశనగ, ప్రత్తి మొదలగు వ్యాపారపు పంటల మీద ఎక్కువ పన్ను విధించారు పలువురుసభ్యులు యీ సభామండపములో అనేక సార్లు తమ అసంతృప్తిని తెలియజేసి వున్నారు, ఎప్పటినుంచి పన్నులు వాటి మీద విధించుచున్నారో అప్పటినుంచి అవి దెబ్బతినుచున్నవి. ముఖ్యముగా రాయలసీమ ప్రాంతములో ఈ రెండువ్యాపారపు పంటలు వర్షాభావమువల్ల దెబ్బతినుచున్నవి. అటువంటి పరిస్థితులలో వాటిమీద పన్నులు విధించి ప్రభుత్వ బొక్కసానికి డబ్బు రాబట్టుటకు ప్రయత్నించడము మంచిది కాదని నా ఉద్దేశము. ఈ విధానాలను ఆచరణలో పెట్టడము చూస్తే ఆశ్చర్యకరముగా వుంటుంది. కేవలము లెక్కలు అన్నీ కరణాల చేతులలో వున్నవి. ఆయన 10 ఎకరాలు అని వ్రాస్తే పది ఎకరాలే, ఏమీలేదని వ్రాస్తే ఏమీలేకపోవడమే; ఈ విధముగా రావలసిన పన్నులు రాకుండా అన్యాయములు జరుగుచున్నవి. అనంతరామన్ కమిటీ సిఫార్సులు ప్రభుత్వానికి

అందినవి. త్వరలో సభ్యులకు కూడ అందచేస్తున్నాము అని అన్నారు. ఈ వ్యాపారపు పంటలమీదకూడ పన్నును తీసే ఆలోచించువుదని ఆర్థికమంత్రిగారు వారి ఉపన్యాసములో చెపుతారని ఆశించాము. అనంతరామన్ కమిటీ సిఫార్సులు అమలు జరిపేలోపుగా ఈ వ్యాపారపు పంటలమీద పన్నును తొలగించడానికి ప్రభుత్వము యోచిస్తుందని భావిస్తున్నాను. విద్యుచ్ఛక్తికిగాను ఎక్కువగా కేటాయించినామని చెప్పారు ఇప్పుడు per capita consumption 7 యూనిట్లనుంచి 15 యూనిట్లవరకు రెండవ పంచవర్ష ప్రణాళిక పూర్తిఅయ్యే సమయానికి పెరుగుతుందని ఉపన్యాసములో చెప్పారు. 15 యూనిట్ల per capita consumption ఏమంత పెద్దవిషయము కాదు. ఈ రోజున మైసూరులో 40 యూనిట్లు per capita consumption వుంది. ఇండియా మొత్తముమీద సరాసరి per capita consumption 25 యూనిట్లు వుంది. త్వరలో 25 యూనిట్లకు per capita consumption పెంచితే సర్వతోముఖాభివృద్ధిని సాధించగలమని ఆశిస్తున్నాము. అధికాహారోత్పత్తి సాధించాలని మంత్రులు పదేపదే చెపుతున్నారు. ప్రాజెక్టులమీద డబ్బు ఖర్చుపెట్టడము మంచిది కాదని అనడం లేదు. ఈ ప్రాజెక్టులమీద ఖర్చు పెట్టినది ఏళ్ళతరబడిగా వుండిపోతుంది. ఈ విద్యుచ్ఛక్తికి ఖర్చుపెట్టిన మనకు మంచి ఆదాయము రావడమే కాకుండా, ఎక్కువ భూమిని సాగుచేయడానికి కూడ అవకాశము వుండగలదని భావిస్తున్నాను. Reclamation of waste land అనే సమస్య వుండదు. Supplementary demands ప్రవేశపెట్టి నప్పుడు ఒక సూచన చేశాను. Open Market loan float చేయండి. ఇప్పుడు గవర్నమెంటువద్ద వున్న schemes అన్నింటినీ sanction చేయండి. అప్పుడే అధికాహారోత్పత్తి సాధించగలుగుతాము విద్యుచ్ఛక్తికి గాను వినియోగించిన డబ్బు యితర రంగాలకు వినియోగించకుండా దీనికొరకే వినియోగించి ఈ open market loans float చేసిన జయప్రదము కాగలదని ఆశిస్తున్నాము.

పొదుపు ఉద్యమాన్ని విజయవంతముగా కొనసాగించ లేకుండా వున్నాము ఉద్యోగస్థులు అంతా ఒక season లో ఒకచోట చేరడము 1000 రూ॥ లో 2 వేల రూపాయలలో సంపాదించాము అనడము ఉద్యమోద్దేశము కాదని అనుకొంటున్నాను. ప్రభుత్వానికి పొదుపు ఉద్యమముద్వారా ధనమును యిచ్చి సహాయపడాలని ప్రజలలో ఒక విధమైన ఉత్తేజాన్ని కలుగజేయాలి Voluntary organisations ఏర్పాటుచేసి వాటిద్వారా తప్పకుండా వసూలు చేయుంచాలి. ఒక్కొక్క సినిమా పోటీలో 100 రూ॥ లు collection కు 5 రూ॥ 10 రూ॥ లు. రూ. 25 turn over వున్న petty dealers అందులో కొంత భాగము యివ్వాలనే ఉద్దేశ్యము కల్గించిననాడే ఈ ఉద్యమము సఫలము కాగలదు. ఈ రోజున మునిసిపాలిటీలకు, పంచాయితీలకు water schemes క్రింద drainage schemes క్రింద

కోట్ల కొలది రూపాయలు అప్పుయిస్తున్నాము. మనము 10 లక్షలు యివ్వదలచు కొన్నప్పుడు ఏ అయిదు లక్షలో వారికి పొదుపు ఉద్యమముద్వారా సంపాదించుకొనమని మిగిలిన 5 లక్షలు ప్రభుత్వము యిచ్చిన బాగుంటుంది. వారు సంపాదించిన డబ్బుతో వారే లాభము పొందగలరనే భావము కలుగచేయాలి. అప్పుడే యిది సఫలము కాగలదు.

శ్రీ బి. శంకరయ్య (బుచ్చిరెడ్డిపాలెము): అధ్యక్షా, బడ్జెట్‌ను సభ ముందు పెట్టే సమయంలో ప్రభుత్వం వెంటనే చేయబోయే పనులను గురించి చెప్పడం సామాన్యంగా జరిగే సాంప్రదాయం. మంత్రిగారి ప్రసంగం చూస్తే Finance Minister ఇచ్చే explanatory note లో ఉండే విషయాలే ఎక్కువగా ఉన్నాయి. ఇది సత్‌సాంప్రదాయంకాదు. బడ్జటు సమయంలో ప్రభుత్వం తరపున ఇప్పుడు దేశంలో ప్రజలను ఏ ఏ సమస్యలు ఎదుర్కొంటున్నయో, వాటి పరిష్కారానికి ఏ ఏ చర్యలు తీసుకోబోతున్నారో చెప్పాలి. కాని అది ఇక్కడ జరగలేదు. Irrigation ను గురించి పెద్దగా చెప్పారు కాని తక్కినవేవీ చెప్పలేదు క్రొత్త పన్నులు ఏమీ వేసనట్లు చెప్పారు. కాని మంత్రిగారి ప్రసంగంలో వేరేచోట "ఇందువల్ల వచ్చే ఏడాది రు. 75 లక్షలు రావచ్చు. మిగిలిన కొరతలను ఇతర విధానాల ద్వారా పూడ్చుకోవాలి" అని ఉంది. బడ్జట్‌లోటు రు. 3 కోట్ల 61 లక్షలలో రు. 75 లక్షలు మాత్రమే వస్తున్నాయి. మిగిలిన లోటును భర్తీ చేసుకోడానికి తరువాత మార్గాలను చెబుతామన్నారు.

ఈ నాడు ప్రజల ముందు ఒక సమస్య ఉన్నది. భూమిశిస్తులు, నీటితీరువాలు ఏ విధంగా ఉండాలో పరిశీలన చేయడానికి అనంతరామన్ కమిటీని నియమించారు. ఆ కమిటీ రిపోర్టు ప్రభుత్వానికి వచ్చినట్లు చెప్పారు కాని, దానిలోని విషయాలేమీ చెప్పలేదు

భూసంస్కరణల బిల్లును ఇదివరకే అన్ని పార్టీలు అంగీకరించాయి. దీనిని గురించి ప్లానింగు కమీషన్ సూచనలు కూడా ఉన్నాయి. మన ప్రభుత్వం తెచ్చిన బిల్లు ఆ సూచనలకు పూర్తిగా విరుద్ధంగా ఉంది. ఆంధ్రప్రదేశ్ ప్రజలందరు కూడా దీనిని మార్చాలని కోరుతున్నారు. తెలంగాణా చట్టానికి దీనికీ ఏమీ సామ్యమే లేదు. భూసంస్కరణల అమలు జరపాలని ప్లానింగ్ కమీషన్ చెప్పిన అభిప్రాయాలకు విరుద్ధంగా మన ప్రభుత్వం భూస్వాములందరూ తమ భూములను అమ్ముకోవడానికి అవకాశం ఇచ్చింది. నాగపూర్ కాంగ్రెసులో కూడా భూసంస్కరణలపై పెద్ద చర్చలు జరిపి చివరకు ప్లానింగ్ కమీషన్ సూచనల ప్రకారం వెంటనే భూసంస్కరణలను తీసుకొని రావాలని తీర్మానం చేశారు. మన ఆర్థికమంత్రిగారు ఈ సందర్భంలో ఆ విషయమై ఏమీ చెప్పలేదు. జమీందారీ విధానం రద్దయిపోయిన తర్వాత

మన రాష్ట్రంలో భూములపై మధ్య దళారీలు ఎవ్వరూ లేరని కేంద్రప్రభుత్వానికి అప్పుడప్పుడు తెలియజేసినట్లు రెవిన్యూమంత్రిగారు చెబుతూ వచ్చారు. ఈ వేళ పశ్చిమగోదావరి జిల్లానుంచి చాలామంది రైతులు ఇక్కడికి వచ్చారు "ఇనాం భూములనుంచి రైతులను తొలగిస్తున్నారు, ప్రస్తుతము ఉన్న చట్టం తమకేమీ రక్షణ కలుగచేయడం లేదని" వారు చెబుతున్నారు. నెల్లూరులో కూడా యిదే విధంగా ఉంది. ఈ విషయాన్ని ప్రభుత్వదృష్టికి పదే, పదే తీసుకుని రావడం జరిగింది. భూసంస్కరణలను పూర్తిచేయవలసిన ఈ సంవత్సరంలో బిల్లును ఫలానా అప్పుడు తీసుకువస్తామని కూడా మంత్రిగారి ప్రసంగంలో లేదు ఇకముందు కాదా ఈ విషయం చెప్పే అవకాశం కూడా లేదు. అదే విధంగా కౌలుదార్లకు రక్షణ కలిగేటట్లు, న్యాయమైన కౌలురేటు నిర్ణయిస్తూ ఒక బిల్లు తెస్తామని ప్రభుత్వంవారు హామీ ఏనాడో ఇచ్చారు. కాని ఇంతవరకు దానిని తేకుండా, కౌలునిర్ణయం లేకుండా వాయిదా వేశారు నాగపూర్ కాంగ్రెస్‌లో మధ్యదళారీలను తొలగించమని చేసిన తీర్మానాన్ని అమలు పరుస్తామని కాని, తాము ఇదివరకు ఇచ్చిన హామీలను నెరవేరుస్తామని కాని బడ్జెట్ ప్రసంగంలో ఎక్కడా చెప్పలేదు. ప్రభుత్వం ఈ విషయంలో హామీ ఇచ్చిన తరువాత పదే పదే అసెంబ్లీలో ఆ హామీలను గురించి ప్రస్తావించాము. ఈ నాటి వరకు వాటి విషయంలో ఎప్పుడు ఏమీచేయదలచారో చెప్పలేకుండా ఉన్నారు.

శ్రీ కె. బ్రహ్మానందరెడ్డి : ఆ హామీ ఏమిటండి ? భూసంస్కరణల బిల్లు సెలెక్టుకమిటీలో ఉన్నది.

శ్రీ బి. శంకరయ్య : ఇచ్చిన హామీ విషయాన్ని ఖచ్చితంగా చెప్తున్నాను. ఈనాం చట్టంఉన్నా అదిఅన్ని ఈనాం గ్రామాలకు ఖచ్చితంగా వర్తించడంలేదు. వారందరికి రక్షణ కలిగేటట్లుగా Estate Land Act ను మారుస్తామని 1956వ సంవత్సరం అక్టోబర్ నెలలో హామీ ఇవ్వబడింది. దీనిని గురించి ప్రతి బడ్జెట్‌లోను మేము ప్రస్తావిస్తున్నా ఇంతవరకు ఆ హామీని నెరవేర్చడానికి ఏట్టి చర్య తీసుకోలేదు. బడ్జెట్ ప్రసంగం కేవలం Finance Secretary ఇచ్చే detailల లాగ ఈ సంవత్సరం అంకెలు ఇట్లా ఉన్నాయి, పోయిన ఏడు ఇట్లా ఉన్నాయని చెప్పడం అనేది ఏమాత్రం కూడ పనికిరాదు. ఈ సాంప్రదాయాన్ని మార్చాలి. సత్సాంప్రదాయాన్ని నెలకొల్పాలి. పార్లమెంటు మాదిరిగా మన బడ్జెట్ అధ్యక్షుని ప్రసంగంతో పూర్తి కాదు. "ఆర్థికమంత్రి ప్రసంగంతో పూర్తి అవుతుంది. ప్రభుత్వం ఈ సంవత్సరంలో చేయబోయే ముఖ్య విషయాలను పేర్కొని ఉండవలసింది. "వారు ఇచ్చిన హామీల మేరకైనా పేర్కొని ఉండవలసింది. భూసంస్కరణల బిల్లును ప్రవేశపెట్టినప్పుడే, మే, జూన్ల నాటికి pass చేయాలని ప్రకటించారు: 1958 సెప్టెంబర్‌లోనే. సెలక్టు కమిటీ సభ్యులు వివిధ ప్రాంతాలకు వస్తామని చెప్పారు.

కానీ అవి వాయిదా పడిపోయింది. కనీసం బడ్జట్ ప్రసంగంలోనైనా దీనిని ఫలానా time లోగా పూర్తిచేస్తామని కూడా చెప్పలేదు కాబట్టి దీనికి సమాధానం చెప్పేటప్పుడైనా ప్రభుత్వం ఈ విషయాలన్నీ ఆలోచించి భూసంస్కరణలు ఎప్పుడు, ఏ విధంగా తేబోతున్నదీ, కౌలుదార్ల ఈనాందార్ల విషయాలలో ఏమి చేయబోతున్నదీ ప్రభుత్వ పాలసీని తెలియచేయాలని కోరుతున్నాను

పంచ ప్లానులు ఏవిధంగా అమలు జరుగుతున్నది, పన్నులు ఏవిధంగా వసూలు చేస్తున్నదీ చూదాము. మామూలుగా ఇదివరకు ఉండే Agricultural Income Tax ను ఇప్పుడు తీసివేసి మెట్టభూములపైన వాటిలో ఏ పంట పండనప్పటికీ పన్నులు పెంచారు. బాగా ఆదాయంవచ్చే వారిమీద పన్నులు వేయాలనే సిద్ధాంతాన్ని ఈ ప్రభుత్వం అమలు జరపడానికి మారుగా ఉన్న Agricultural Income Tax ను కూడా తీసివేశారు. యిది న్యాయంకాదు. ఈవిధంగా సామాన్య ప్రజపై పన్నుల భారం ఎక్కువ అవులోంది.

ఇక విషయం ఏమిటంటే మనము సుమారు లక్షడెభైవేల మంది N. G. O.s ఉన్నారు రాష్ట్ర, కేంద్ర ప్రభుత్వాల ఉద్యోగుల జీతాలలో చాలా తేడాలున్నాయి. ఇప్పటి ధరల దృష్ట్యా వారి జీతాలు పెంచాలని ప్రజలు అందరూ అడుగుతున్నారు దేశంలోని ఏ Pay Commission కూడా ఉద్యోగుల జీతాలకు ముడిపెట్టడం అనేది జరగలేదు. పన్నులను గురించి మనం సంవత్సరం పొడుగునా చర్చిస్తూనే ఉంటాము వేస్తూనే ఉంటాము. వీటికి, జీతాలకు ముడిపెట్టడం న్యాయం కాదు. మొన్న ప్రకటించిన Pay Committee Report అమలు జరపడానికే రు. 4½ కోట్లు ఖర్చు అవుతుందని ఆర్థికమంత్రిగారు చెప్పారు. అసలు నిజంగా ఒక్కొక్కరికి రు 20/- ఇచ్చినా రు. 4 కోట్లకంటే ఎక్కువ కాదు. మంత్రిగారు చెబుతున్న రు 4½ కోట్లు ఖర్చు అవుతుందంట, ప్రతి ఉద్యోగికి రు 20/- ముట్టుతుందా? Typists and Stenographers కు ఇదివరకు ఉన్న scales కూడా తగ్గిపోయినట్లు చెబుతున్నారు.

శ్రీ కె. బ్రహ్మానందరెడ్డి : Typists, Stenoes గురించి Pay Committee report లో ఏమి వ్రాశారో చదివారా? మళ్లీ ఒక మారు చదివింది.

శ్రీ పి శంకరయ్య: ఇంకా వివరాలు ఉంటే మళ్ళీ చదువుతాను. Pay Committee Report ను అమలు చేయడానికి రు 4½ కోట్లని ఒకమారు, రు. 4 కోట్లని ఇంకొకసారి, రు. 8 కోట్లు అని మరోసారి ఖర్చు అవుతుందని ఆర్థికమంత్రిగారు చెప్పారు. ఈ విధంగా చెప్పడం న్యాయంకాదు. ఆ కమిటీని వేసేనాటికి నేటికి ధరలు ఎంతగా పెరిగి పోయాయి? ఈ ధోరణిలో విషయాలను పరి

శీలించడం పోయి, వారు హెచ్చు జీతాలు కావాలని అడిగినందుకు వారి సంఘాల్ని గుర్తించము అని ప్రభుత్వం నిర్ణయించడం చాలా ఘోరమైన విషయం. ప్రజాస్వామ్యమని సోషలిస్టు పంథాల్లో నడవాలని చెప్పుకొనే ఈ రోజులలో ప్రభుత్వ ఉద్యోగులు హెచ్చు జీతాలు కావాలని అడిగితే వారి సంఘానికి recognition తీసివేస్తామని ప్రభుత్వం నిర్ణయించడం, High Court లో దానికి stay రావడం అనేది సరియైన పద్ధతికాదు. అందుచేత వారి విషయంలో కూడా ప్రభుత్వం సానుభూతితో పరిశీలించి, నేటి ధరల దృష్ట్యా వారికి న్యాయం చేయాలని కోరుతున్నాను.

ఇక ప్రస్తుత పరిపాలన ఏ విధంగా ఉన్నదీ చూద్దాము. నెల్లూరు కాల్పులను గురించి వాయిదా తీర్మానం తీసుకొని రాగా, "అక్కడ చాలా పెద్ద అధికారులే ఉండి, కాల్పులకు ఆర్డరు ఆలోచించే ఇచ్చారని సమాధానం చెప్పబడింది. వాస్తవ పరిస్థితులకు విరుద్ధంగా ఏ విధంగా reports వస్తున్నాయో ఈ ఒక్క ఉదాహరణ వల్ల తెలిసికోవచ్చు. కాల్పులకు ఆర్డరు ఇచ్చింది సుబ్బారావనే సబ్-ఇన్‌స్పెక్టరు. అక్కడ పెద్ద అధికారులెవ్వరులేరు. న్యాయ విచారణ జరిపిస్తే నిజం బయట పడుతుంది. అలా చేయకుండా ఎవరో ఒక ఉద్యోగి పంపిన report ను ఆధారం చేసుకొని ముఖ్యమంత్రి ఇక్కడ సమాధానం చెప్పారు. ఏ పెద్ద ఉద్యోగీ కాల్పులకు ఆర్డరు ఇవ్వలేదు. తరువాత వచ్చిన report లో ఆ విధంగా కల్పించి ఉండవచ్చు. సుబ్బారావు అనే సబ్ ఇన్‌స్పెక్టరే కాల్పులకు ఆర్డరు ఇచ్చినట్లు అక్కడ చూచిన వందలకొలది ప్రజలు చెబుతున్నారు. పరిపాలన ఈ విధంగా సాగుతోంది.

వంశధార మొదలైన projects ను గురించి కూడా ఈ ప్రసంగంలో ఏమీలేదు. ముఖ్యంగా మా జిల్లాకు సంబంధించిన విషయం ఉంది. నాగార్జున సాగర్ ప్రాజెక్టు విషయంలో కావలి-కనుపూరు కాలువను వెంటనే త్రవ్వితే దానికి కావలసిన డబ్బునంతా అక్కడ ప్రజలు ఇస్తామంటున్నారు. కేంద్ర ఇరిగేషన్ మంత్రి హాఫీజ్‌గారు అక్కడకు వచ్చి చూచి, "ఇంత లాభకరమైన ప్రాజెక్టు మరొకటిలేదు, అది త్వరగా sanction అయ్యేటట్లు చూస్తామ"ని హామీ ఇచ్చారు. ఎవరైనా వచ్చి సిఫార్సుచేస్తె యిటువంటివి జరుగుతున్నాయి గాని వెంటనే ఆహార ధాన్యాలను ఇచ్చేవి, తక్కువ ఖర్చుతో ఎక్కువ ఫలసాయం ఇచ్చేవనులేవీ ఇక్కడ జరగడంలేదు, ఇక్కడి పరిపాలన కేవలం గ్రూపుల పక్షపాతం లేకుండా ప్రతి సమస్యను దాని మంచి, చెడ్డలను దృష్టిలో పెట్టుకొని పనిచేస్తే మన ప్రణాళికలను ప్రజాసామాన్యానికి లాభసాటిగాను జయప్రదంగా అమలు జరుపుకోవచ్చు.

*Sri S Runganatha Mudaliar (Ramakrishna Rajupeta)*: Madam, the budget under discussion has been variously d scribed in the press as 'fear-free budget', 'balanced bud get' 'a drab budget' and 'a tame budget' and so on, but the implication of the sum-total of these criticisms is that it is a re-assuring budget against which nothing postively hostile can be said. In this respect, the hon. Finance Minister deserves our congratulations. This is the first time that a balanced budget has been achieved in this State It is an ordinary proposition that a deficit budget is a sign of progress and so a State like ours whose objective is over-all progress cannot afford a balanced budget; but that need not cause us any anxiety at present, for with the prospect of rise in the State revenues, any amount of expenditure on any Plan need not cause us any anxiety. There is the added comfort that there are to be no fresh taxation proposals, but that does not mean the Government have bound themselves not to impose taxation in the near future. As we all know, the cry of the time and the slogan of all the parties are couched in such catch-phrases like 'political progress', 'economic uplift' and 'social welfare of the ordinary man' and these slogans and cries pre-suppose a furtherance of development plans and they necessarily require money and money must come from fresh taxation. For the present, the deficit is only Rs. 37 lakhs. The hon. Minister has stated that this deficit will be met from the proceeds of the change in the rate structure of taxation to be imposed on goods and passengers carried by motor vehicles. That source seems to fetch us a surplus of Rs 75 lakhs and this would not only enable the deficit of Rs. 37 lakhs to be wiped out, but also there would be a surplus of about Rs. 38 lakhs. This fact taken along with the announcement that a full year provision of Rs. 3 crores is made to meet the recommendations of the Pay Committee is conducive to general satisfaction, though it is doubtful whether Rs. 3 crores will be sufficient and also whether the N. G. Os. will accept the recommendations so far made.

While liberal provision has been made for advances to cultivaters, the provision made for industrial and low income group housing scheme is pitiably low. Only a sum of Rs. 45 lakhs has been provided in this regard which I fear will hardly be sufficient to meet the increasing demands. The hon. Finance Minister has referred to the Small Savings with regard to which, according to his own admissions, the position is very unsatisfactory. The name 'Small Savings' is an euphemism for forced contribution from merchants, contractors, cinema operators and bus operators levied by officers connected with the departments which deal with those subjects e g. Sales - Tax Department, Revenue Department, Motor Transport Department etc. My contention is, the Small Saving Scheme has not touched the ordinary man and the woman in the rural area; nor has it touched the man and woman of the labour class in the urban areas for whose benefit the scheme was originally conceived.

Provision made for the welfare of the Harijans and the Backward Classes deserves some mention. The distinction between the Harijans and the outcastes is still being maintained and I feel it rather unfortunate in as much as it tends to the perpetuation of caste-consciousness and caste-aloofness which, ironically enough, receives strength from the various benefits attached to these communities statutorily. The provision made for the Harijan Welfare is liberal enough, but the provision made for the improvement of Backward Classes is rather more in the nature of a dolf. Only Rs. 21 lakhs have been provided for the advance of these Backward Classes, whose names, we know, are so innumerable, and I fear it is a drop in the ocean. There are other classes who are really backward, but who do not come technically within the definition of the Harijans or Backward Classes Government some-how has discovered the existence of such classes and they have come forward to their aid though in a limited measure. On this account the Government deserve praise at our hands.

[Mr. Speaker In The Chair]

The results of the Economy Committee are anxiously awaited by all well-meaning men. It remains to be seen how far the labours of the Economy Committee will result in effecting economy at all levels and increasing efficiency in Government adimistration. An unfortunate omission, which is a rather conspicuous omission, is the absence of any reference to minor irrgation schemes in the Budget speech. Probably, the cause is, the State is so much project-minded that it has evidently forgotten references to minor irrigation schemes. Projects may be all right in their own way, but there are Districts like Chittoor and Srikakulam and other places where minor irrigation sources are absolutely necessary and without which there can be no progress at all. Any amount that we may spend on projects will be all right, but if only projects are developed, the development in the country will be lopsided and you will have very fertile areas on one side and very backward, barren and dry areas, on the other. People like us who belong to Districts like Chittoor will have no salvation if our present welfare, happiness and resources are mortgaged for the benefit and happiness of unborn generations by expecting us to pay in the form of taxes etc. only for the development of the projects.

We are also entitled to live and we want to have some benefits. It will be no consolation to us if we are told 'look here, look there; great projects are in progress; 20 years hence, milk and honey will flow in our country'. That is no consolation for us who are starving. Side by side with the projects, it is absolutely necessary that mionr irrigation projects should be given equal attention. There must be a balanced progress and not a lopsided development. Therefore, I appeal to the Finance Minister not to forget this essential need of dry areas like Chittoor. If our projects are completed—not to omit the minor irrigation schemes, which I put on a level higher than the projects—with all such projects completed and all minor

irrigation schemes successfully implemented, the Andhra Pradesh will have no food problem in the future. There will be no famine at any time, it is hoped, in Andhra Pradesh, and I am sure Andhra Pradesh will become the granery of the East. How soon such a state of affairs will come about depends upon, as the Finance Minister put it, our continous alertness, vigilance, hard work and sacrifice

Thank you.

శ్రీ ఎన్. శ్రీనివాసరావు (తాడేపల్లిగూడెం-రిజర్వుడు): అధ్యక్షా, ఆర్థిక శాఖా మాత్యులు సర్వాంగసుందరంగా, paper scarcity ఉన్న రోజులలో చక్కని కాగితంపై మంచి లిపిలో తయారుచేసి నటువంటి ఈ బడ్జెటును బలపరచలేకుండా ఉండలేకపోతున్నాను. చాలామంది బలహీన పరచాలని అనుకుంటున్నారుకాని నేను బలపరచలేకుండా ఉండలేకపోతున్నాను.

మిస్టర్ స్పీకర్: ఇంతకూ బలపరుస్తున్నారా, లేదా?

శ్రీ ఎన్. శ్రీనివాసరావు: బలపరచలేకుండా ఉండలేకపోతున్నాను అంటే బలపరుస్తున్నానన్నమాట. అయితే కొందరికి ఈ బడ్జెటులో ఏమి ఉన్నట్లు కనిపించడం లేదు. వారి వారి దృక్పథాలనుబట్టి వారికి బడ్జెటులో ఏమీ అర్థం కావడంలేదు. వారిలో నిబిడీకృతమైన సిద్ధాంత విజ్ఞానరీత్యా వారికి అలా గోచరించవచ్చు. కొంతమంది దీనిని blank cheque అన్నారు. దీనిలో అక్షరాలే లేవు అన్నప్పటికీ తత్సంబంధీకులు నమ్మవచ్చు. కాని ఇది అందరిపట్ల యథార్థముకాదు. మొత్తం అంతా బాగా ఉన్నదని, పండు వెన్నెలతో నిండిఉన్నదని, పాలు, తేనెలు ప్రవహిస్తున్నవని చెప్పను ప్రతిపక్షంగా ఉన్నంత మాత్రంచేత 'సున్నకి సున్న, హళ్లి హళ్లి' అని చెప్పడంకూడా సబబుకాదు. బహుశః శాసన సభ్యులు కాకపోయి నప్పటికి, ఎంతోమంది విజ్ఞానవంతులు బయటఉన్నారు, వారు మనమేమి చేస్తున్నామో కనిపెడుతున్నారు. నిజమైన విషయాలు చెబుతున్నారా, లేక కేవలం పార్టీ ప్రచారం కోసం చెబుతున్నారా, లేక వ్యక్తిగత ద్వేషాలవల్ల చెబుతున్నారా, లేక గట్టిగా మాట్లాడలేక పత్రికలలో పెద్ద అక్షరాలలో పడుతుందని చెబుతున్నారా, అని ప్రజలు తర్కించుకోగలరు. కొంతమంది వ్యక్తులు తమ సిద్ధాంతాలను అభిప్రాయాలను బలవంతంగా రుద్దాలని ప్రయత్నించినా అది జయప్రదం కాజాలదు.

మన ముందున్నది deficit budget అయితే దీనిని surplus గా చేయుటానికి శ్రీ బ్రహ్మానందరెడ్డిగారికి పది నిమిషాలు పట్టదు. ఆయన అలా చేయగలరు. అయితే చేయవలసిన పద్ధతి అదికాదు. ఎన్నో పథకాలు [illegible] ప్రభుత్వంవారు

అమలు జరుపుతున్నారు. ఏపార్టీ సభ్యుడైనప్పటికీ కారు వేసుకొని ప్రయాణంచేస్తుంటే 10 మైళ్లు, 20 మైళ్ళు సిమెంటురోడ్లు కనిపిస్తాయి. ఎన్నో గ్రామాలలో విద్యుచ్ఛక్తి దీపాలు కనుపిస్తాయి. ఎన్నోచోట్ల ఆసుపత్రిలు కనుపిస్తాయి. వాటిని కన్నులుండీ చూడలేక, చెవులుండీ వినలేక ఏమిలేదని చెప్పడం న్యాయంకాదు. అంతా బాగుగా ఉన్నదా? అంటే లేదనే చెప్పవలసిఉంది. అయితే ఎన్నో సాధక బాధకాలున్నాయి. రాజ్యాంగరీత్యా మాకు ఈయబడిన హక్కులవల్ల మాలో కొంతమంది ఇక్కడ శాసన సభలలో ఉండవచ్చు. అయితే చాలా మంది దుఃఖమయ జీవితాన్ని గడుపుతున్నారు. మాలపల్లెలలో పందలాది వేలాది సంవత్సరాలనుంచి పెద్దుళ్ళచే కప్పబడిన చుట్టు గుడిసెలలో, మహా మేరు పర్వతములవంటి పెంటపోగులు, బురదగుంటల వాతావర ణంలో హీనాతిహీనంగా హరిజనులు జీవయాత్ర సాగిస్తున్నారు. వారిని గురించి ప్రతిపక్షములవారు యోచించడంలేదు. వారి సమస్యలను పరిష్కరించడానికి ఏమి చేశారని అడుగుతున్నాను. ఏమీ చేయలేదనే నా అభిప్రాయం. బడ్జెటును ఏమూల నుంచి విమర్శచేస్తే బాగుంటుంది అనే ఆలోచిస్తున్నారు కాని వారు పేదవారికి చేసిన సహకార మేమీలేదు. వారు వారి పార్టీ నిర్మాణ కృషిలోను, బహుశః శాసనసభలకు రావడంవల్ల లేదా విశ్వాసరాహిత్య తీర్మానం తీసుకొనివచ్చే ప్రయత్నంలోను ఎక్కువ కాలం వినియోగిస్తుండడంవల్ల హరిజనులకు సహాయంచేసే స్థితిలోలేరు. కడకు హరి జనులకు, వెనుకబడిన తరగతులవారికి ఇచ్చిన D. C. lands ను కూడా తీసివేయ మని శాసనసభలో చెబుతున్నారంటే వారియొక్క మనస్తత్వం ఎటువంటిదో గుర్తిం చాలని నేను చెబుతున్నాను. వారి కార్యక్రమం జయప్రదం కాజాలదని తమద్వారా తెలియజేస్తున్నాను.

ఇక ఫిషరీస్ విషయంలోకూడా హరిజనులకు నష్టం కలుగుతోంది. ఒకవంక సహకార సంఘాలను అభివృద్ధి చేస్తామని చెబుతున్నప్పటికి గ్రామాలలోని హరి జనులు సభ్యులుగా ఉన్న F. L. C. Socities కు చేపలను పట్టేపని ఈయడం లేదు. ఈ పేద ప్రజలు సంవత్సరంలో ఏ రెండు నెలలో వ్యవసాయపు పనులు చేస్తారు. ఇంకొక రెండు మూడు నెలలు చేపలు పట్టడం, మట్టిమోయడంవంటి పనులు చేస్తారు. మిగతా కాలమంతా వృథాగా ఉండవలసి వస్తుంది. ఇప్పుడు చేపలు పట్టే పనికూడా పంచాయితీలకు అప్పగిస్తామంటున్నారు. పంచాయితీలో ఉన్నవారంతా ధర్మ రాజులే. 24 గంటలు గ్రామస్థుల అభివృద్ధికి పాటుపడేవారై ఉంటే గ్రామ ప్రాంతాల లోని చెరువులను పంచాయితీలకు ఇచ్చినా అర్థమున్నది. కాని ఎవరో చెరిగిడీలకు, నగరాలకు సబ్-లీజ్ ఇచ్చేటప్పుడు ఈ చెరువులను పంచాయితీలకు ఎందుకు ఈయ వలెనో అర్థం కావడంలేదు. కాబట్టి చేపలను పట్టుకొనుటకుగాను ఈ చెరువులను హరిజనఫిష్ర్మెన్ కో ఆపరేటివ్ సొసైటీలకు ఈయవలెనని మనవిచేస్తున్నాను.

ముఖ్యమంత్రిగారికి తెలియకుండా ఎవరో ఈ చెరువులను పంచాయితీలకు ఇచ్చుటకు ఉత్తరువులు జారీచేశారనే మాట రాకుండా వీటిని హరిజన సంఘాలకు ఇప్పించ గోరుతున్నాను. నిరుద్యోగం ఎక్కువగా ఉన్న ఈ విషయంలో శ్రమించి జీవ యాత్ర సాగించే హరిజనులకు వృత్తి పనులు నిలుపవలసినదని తద్ద్వారా మనవి చేస్తున్నాను.

ఇక మైనర్ ఇరిగేషన్ పనులగురించి ఎన్ని ఖండకావ్యాలు వ్రాయాలో అర్థం కావడంలేదు. 'ఏ కాల్వ కొరకు ఎంత ఖర్చుయ్యేనో' అంటే మంత్రులను ప్రశ్న చేయమని చెప్పాను. అది చాలా చిన్న కాలవేకాని పరదపప్రమాదం ఎక్కువ. ఎత్వ కాలువ స్కీముకు డబ్బు ఖర్చు తక్కువగాను ఫలితం హెచ్చుగాను వుంటుంది. ఇందుకు సంబంధించిన వివరాలున్నాయి. ఇటీవలనే ముఖ్య మంత్రిగారు ఈ కాలువ గురించి ఎక్కడనో 'త్వరలోనే చేస్తాము అన్నా' అని చెప్పినట్లు గుర్తున్నది. ఆ త్వర లోనే అనేదానిని 1960 కి వెళ్లనివ్వకుండా ఈ సంవత్సరమే ఆ స్కీమును అమలు చేస్తారని ఆ ప్రాంతపు రైతుల ఘోష తగ్గుతుందని ఆశిస్తున్నాను.

హరిజనులకు ఇండ్ల స్థలాలిచ్చే విషయమున్నది. శ్రీ సంజీవయ్యగారు 'పేద వానికి మురికి సంతానం' అని అక్కడకూడ చెబుతుంటారు. పది సంవత్సరములు ఈ మధ్య హరిజనులలో సంతానోత్పత్తి ఎక్కువయినది. ఫామిలీ ప్లానింగు ప్రచ గండా vans మొదలైనవి గ్రామ ప్రాంతాలకు వెళ్ళినా హరిజనులకు అవి అందు బాటులో ఉండని కారణంచేత హరిజనులలో సంతానాభివృద్ధి ఎక్కువగానే ఉన్నది. 10 సంవత్సరములక్రితం ఎంత స్థలం అలాట్ చేశామో అంత స్థలంలోనే ఈనాడు కూడా ఉండమంటే అది సాధ్యమయ్యే పనికాదు. ఏ నిష్పత్తితో సంతానం అభివృద్ధి చెందినదో ఆ నిష్పత్తిలోనే వారికి హెచ్చుగా ఇండ్లస్థలాలు ఈయవలసి ఉంటుంది. అందుకుగాను ధనసహాయం చేయవలసిఉంటుంది. నాగరిక ప్రపంచంలో ప్రతి మాన వుని కనీస అవసరం ఇది.

మన దేశానికి విదేశాలనుంచి, రష్యానుంచికూడా, ఎంతోమంది వస్తున్నారు. ఈ దేశంలో జరుగుతున్న అభివృద్ధిని గమనిస్తున్నారు. ప్రశంసిస్తున్నారుకూడా. వారెవరు అంగీకరించినా మన సోదరులుమాత్రం అంగీకరించడంలేదు. కాంగ్రెస్ ప్రభుత్వాలు గ్రామాలలో ఎన్నో మార్పులు తీసుకురాగలిగాయి. అందులో శ్రీ సంజీవరెడ్డి ప్రభుత్వం ఎంతో అభివృద్ధి సాధించగలిగినదని సువర్ణాక్షరాలతో వ్రాసే టట్లుగా కృషిచేయవలసి వున్నది. ఒక్క సంజీవరెడ్డిగారు చేస్తే చాలదు. మంత్రి వర్గంలోని మిగతా సభ్యులుకూడా అందుకు కృషిచేయాలని తద్ద్వారా మనవి చేస్తు న్నాను.

ఇక కొల్లేరు విషయం మీకు మనవి చేస్తున్నాను. కొల్లేరులో ఒక్కొక్క సంవత్సరం జరిగేటటువంటి పరిస్థితుల గురించి కనీసం ఆరు లక్షలరూపాయలు ఖర్చుఅవుతూఉంటుంది. ఆకొల్లేరు విషయంగురించి అక్కడివారు petition పెట్టుకొని, వాటిపైన మినిస్టరుయొక్క ఆర్డర్ అయి అక్కడకు వెళ్ళేవరకు అయ్యేఖర్చు దామాషాగా లెక్కవేస్తే ఆరులక్షల రూపాయలు ఉంటాయని మనవి చేస్తున్నాను. ఇంత ధనము కేవలం ప్రయత్నాలకోసమే ఖర్చు చేయబడుతున్నది. ఎందుచేతనంటే ఆ పిటిషను, అక్కడ కింద ఆఫీసులనుంచి Revenue Board కు వెళ్ళాలి అక్కడనుంచి మంత్రిదగ్గరకు వెళ్ళాలి దానిపైన ఒక మినిష్టరు ఒక order వేస్తే, ఇంకొక మినిష్టరు ఇంకొక order వేస్తారు. ఈ విధంగా ఒక ఖచ్చితమైన policy లేకుండా ఉంటున్నది. ఇంజనీర్లకు ఇస్తామంటే నాకేమి objection లేదు. కొంత పెట్టుబడి పెట్టేటటువంటి వాళ్లు ఉండాలి, కనుక ఇంజనీర్లు ఉండవలసిందే; అయితే మొత్తంలో ఇంత శాతాన్ని ఇంజనీర్లకు ఇస్తున్నామని, ఇంత శాతాన్ని F.L.C. సొసైటీలకు ఇస్తున్నామని, ఇంత శాతాన్ని individual grant గా ఇస్తున్నామని ఏర్పాటు చేయాలి. లేక రివెన్యూమంత్రిగారు, Irrigation మంత్రిగారు, ముఖ్యమంత్రిగారు ఒకరోజున అక్కడ కూర్చొని, ఒక పద్ధతిని, ఒక policy ని నిర్ణయించుకొని ఆ విధంగా చేస్తే ఈ ఆరు లక్షలరూపాయలు waste కాదు. ఏ Mysore Cafe లోనో, గోపీహోటల్ లోనో కూర్చొని తింటూ ఉండడం గాని, మంత్రిగారికి సంబంధించిన వారికో లేక ఏ M.L.A. కు సంబంధించినటువంటి వారికో recommend చేసేటటువంటి విధానంగాని లేకుండా పోతుంది. అక్కడ సక్రమంగా సకాలంలో వ్యవసాయం చేసుకోవడానికి అవకాశంఉంటుందని తమద్వారా మనవిచేస్తున్నాను. ఇది తక్షణం చేయవలసినటువంటి కార్యక్రమం. ఎప్పుడో మనం భూసంస్కరణలు పెట్టి land commission తీసుకువచ్చి, ఆ land ను demarcate చేసి, ఆ policy ని నిర్ణయిస్తామనే దానికంటె, ఇప్పుడు శ్రీ వెంకట్రావుగారు చెప్పిన లెక్కల ప్రకారంఉన్న 30 లక్షల ఎకరాల కొల్లేరు భూమిని వెంటనే dispose చేసి— అది సమిష్టి వ్యవసాయానికి అనండి, joint farming అనండి— ఏదో విధంగా పంటపండే విధానాన్ని త్వరగా అమలుపరిస్తే బాగుంటుందని మీద్వారా మనవి చేస్తున్నాను.

ఇక గ్రంథములు జాతీయం చేయాలన్న భావం మంచిదే. చక్కని పుస్తకాలు పిల్లలకు అందజేయాలి. ఉచితమైన విద్య ఇవ్వాలి. వీరమల్లాదేవి మొదలయిన వీరమాతలను స్మరించాలి. ఉగ్గుపాలతో విద్య నేర్పించాలనే అభిప్రాయంతో ఆ పుస్తకాలు జాతీయం చేయడం జరిగిందని అనుకొంటున్నాను. అందులో సందేహము లేదు. కాని ఈవేళ ప్రశ్నల సందర్భంలో Education Minister గారు press వాళ్ళు ఎంత ప్రయత్నించినా ఒక press కూడా దొరకడం లేదని అన్నారు, కాని.

ప్రభుత్వం ఏదయినా చేయాలని తలపెట్టినప్పుడు ముందుగా దానికి కావలసిన సామాగ్రి అంతా తయారు చేసుకొని తరువాత ఆ కార్యక్రమానికి ఉపక్రమించాలి. ఇక ఆ పుస్తకాలలోని వ్రాతలు గురించి చెప్పవలసి వస్తే, మంత్రికి ఒక ఉపమంత్రి ఉన్నట్లు, సెక్రటరీకి ఒక డిప్యూటీ సెక్రటరీ గాని అసిస్టెంట్ సెక్రటరీ ఉన్నట్లుగా, ఎవరో సుబ్బరాయశాస్త్రిగారు ఆ పుస్తకం వ్రాస్తారని అంటె, ఆయన ఆ పనిని అతని ప్రియశిష్యునికి ఇవ్వడం, ఆ శిష్యుడు తనక్రింద శిష్యునికి ఇవ్వడం ఆ క్రిందశిష్యుడు ఏదో వ్రాస్తే అది శాస్త్రిగారు వ్రాశారని అనుకొని ఆ గ్రంథాలు publish చేసే టటువంటి విధానం ఎంతవరకు సమంజసంగా ఉంటుందో ఆలోచించవలసిందని కోరుతున్నాను ఇటీవల బుద్ధుని చరిత్ర మనమంతా విన్నాము, చాలావిచారపడ్డాం: పాప పరిహారార్థం పాపము ఎక్కువగా చేయాలని చెప్పినట్లుగా బుద్ధుని గురించి మన గ్రంథాలలో వ్రాసుకొన్నాము. చరిత్రలో అట్లాంటి బీజాలతో, అట్లాంటి అనుమానాలతో కూడుకొన్నవి వ్రాయడమెందుకు? గ్రంథాలలో అటువంటివి ఇక ముందు రాకుండా చేయాలని దానికి కట్టుదిట్టమైన ఏర్పాటు చేయాలని మనవిచేస్తున్నాను. తరువాత ఆ గ్రంథాలకమిటీలో చాలా వయస్సుఅయిన వాళ్ళనే వేస్తున్నారు; మంత్రి గారి దృష్టిలో చిన్నవాళ్ళు లేరను కుంటాను, లేకపోయినా చాలా సంతోషమే. కాని మంచివాళ్ళను వేయాలని మనవి చేస్తున్నాను. వారు ఏమి వ్రాస్తున్నారు, ఏ విధంగా వ్రాస్తున్నారనేది మాత్రం చూడ వలసిందని మనవి చేస్తున్నాను.

ఇంకొక అభిపందనము చెప్పి ముగిస్తాను. అన్ని పార్టీలవారికి, బాగా గుడ్లు, గులాబిజాములు మొదలయినవి తిన్న తరువాత సంగీతము, సాహిత్యము మొదలైన వ్యవహారం కావాలనుకొంది. వారంతా నృత్యాదులు ఏర్పాటు చేసుకోవచ్చు. కాని "music and art is an additional factor for the brain and the human prosperity" అన్నారు. ప్రభుత్వంవారు నాటక Academy ఒకదాన్ని ఏర్పాటు చేసినందుకు చాలా సంతోషము. కాని నేను కావన సభ్యుడుగా ఉండి, సంజీవరెడ్డిగారికి కృతులు ఇచ్చి, వారి అల్లుడని, వీరి అల్లుడని చెప్పుకొనేటటువంటి నాకే ఒక drama ఆడుకోడానికి Hall దొరకక, 18 వందల రూపాయలు ఖర్చు పెట్టుకొన్నాను. ఒక చక్కని హాలు నిర్మాణం చేయాలని సంకల్పం చేస్తున్నట్లుగా విన్నాను. అది public donations తో కాకుండా ప్రభుత్వం ఖర్చు చేస్తున్న ఇన్ని కోట్లలో ఏ మూలో కొత్త మూడు కూడా ఇచ్చి నట్లయితే, ఒక మంచి theatre అవుతుంది. కనుక అది కూడా ఏర్పాటుచేయ వలసిందని నేను మనవి చేస్తూ, ఈ నాటక కళా రంగాన్ని పోషించేందుకు ఒక అర్థ మంత్రినైనా వేయవలసిందని మనవి చేస్తున్నాను.

శ్రీ బి. శ్రీరామమూర్తి (విజయనగరం) :—అధ్యక్షా, మన మిత్రులు నరసింగరావుగారు మాట్లాడుతూ చాలా అభ్యుదయం జరిగిందని, మీరెవరు చూసేటట్లే

పోయారని చెప్పారు, కాని వారెక్కడకేరు. వారికి చూపుతోడే సంబంధంవుంది తప్ప దురదృష్టవశాత్తు వినడంతో సంబంధంలేదు ఎందుకంటే, మేము ప్రభుత్వం చెవిలో ప్రజల తాలూకు కోర్కెలనే శంఖానిని చాలా పూర్తి ఊదుతూనే వచ్చాము. రామకృష్ణారెడ్డిగారు కొత్తగా చాలా ఆవేశంతో మాట్లాడారు ఈ బడ్జెట్ అంటె జమా ఖర్చు అన్నారు. నిజానికి ఇది ప్రజల తాలూకు డబ్బు జమా. ఖర్చులకు సంబంధించినదని మనవి చేస్తున్నాను. సామాన్యంగా బడ్జెట్ ప్రతిపాదన చేసేటప్పుడు, గవర్నరుగారి ప్రసంగం ఏర్పాటు చేయడం ఉంటుంది. ఇది మన దేశంలోనే కాదు, అన్ని దేశాలలోను, అంగీకరించినటువంటి ప్రజాస్వామ్య సాంప్రదాయము. ఇది కేవలం సాంప్రదాయమే కాదు. దీనిలో ఒక పద్ధతి ఉన్నది. ఒక principle ఉన్నది. The Government symbolises a political party. But the State symbolises the pople. గవర్నరు ఒక Head of the State క్రింద people కు కావలసిన కార్యక్రమాన్ని తాను ముందుగా తెలియపరచడం జరుగుతుంది. The speech delivered by the Governor or the statement issued by the Governor acquires the authority and the character and the dignity of the State. But today by dispensing with the speech of the Governor, the Government have identified itself with the State.

మిస్టర్ స్పీకర్ : అవిధంగా కాదేమో! బ్రిటిష్ పద్ధతి ప్రకారం, the King makes a speech according to the dictation of the Prime Minister of the day.

శ్రీ బి. శ్రీరామమూర్తి : అది Prime Minister dictate చేసిందే కావచ్చు, కాని దానిలో ఒక sanctity ఉన్నది. అది లేకపోయినట్లైతే ఒక విధంగా ఇది naked గా ఉన్నట్లు స్పష్టంగా కన్పడుతుందని మాత్రం నేను మనవి చేస్తున్నాను. ఆ రకంగా లేకపోవడంతో ప్రభుత్వము అనుకొన్నటువంటి totalitarian terms కు ఇది కార్యక్రమం క్రింద మాత్రమే నేను తీసుకోగలుగుతున్నానని మనవి చేస్తున్నాను.

ఇక ఆదర్శాలను చూచుకొన్నట్లయితే అందరు అంగీకరించ గలిగినటువంటి విశాలమైన ఆదర్శాలనే ప్రభుత్వము పదే పదే ప్రకటించడం చూస్తున్నాము, కాని ఆదర్శాలలో సమానత్వం కల్పించినప్పటికీ, ఆచరణలో మాత్రము భేదము వ్యత్యాసము కన్పడుతుంది. కేవలం ఆదర్శాలను ప్రకటించడం మాత్రమే గాని ఆచరణలో వాటిని పెట్టడం లేదు. ఈ విధమైన పరిస్థితిలో మాటకు చేతకు వ్యత్యాస ఉన్నట్లు వలెనే. అఘాతంలో మనం దేశాన్ని దించడం జరుగుతున్నది. ఈ విధంగా అధికారంలో దేశాన్ని పూడ్చడానికి ప్రయత్నం. చేస్తే మాత్రం, అది సాధ్యపడే విషయం,

కాదు అని నేను మనవి చేస్తున్నాను. ఈ సందర్భంలో ఒక చిన్న కథ కూడా మనవి చేస్తాను. ఒకతను ఒక ఆమెను ఏలాగైనా వివాహము చేసుకోవలెనని ఒక స్వామి దగ్గరకు వెళ్లితే ఆ స్వామిగారు ఒక మంత్రించెప్పి, "ఈ మంత్రాన్ని పల్లించేటప్పుడు, కోతిని మాత్రం తలచకూడదు. ఒకవేళ అట్లా తలిస్తే నువ్వు ఆ అమ్మాయికి బదులుగా కోతినే ప్రేమిస్తావు" అని ఆయన చెప్పాడు. కాని, ఆఖరికి ఆ కోతిని మరచి పోవటానికి సాధ్యంకాక, ఆమెతో వివాహం కాకుండా, ఆ కోతే మిగిలిపోయింది ఆయనకు. అదే విధంగా ఆదర్శం అనేటటువంటి అమ్మాయిని వివాహం చేసుకోవాలని ప్రయత్నం చేసినప్పటికినీ అధికారంలో ఉన్నటువంటి మంత్రాన్ని పల్లించినప్పటికి the monky of the mind still persists. కనుక ఆదర్శాలు కేవలం mum అయిపోతున్నాయని చెప్పడానికి సాహసిస్తున్నాను. ఈ రోజున democracy గురించి, ప్రభుత్వము విధానం ఎంత మాత్రం సరికాదని చెప్పదలుచుకోలేదు గాని democracy కి ఈ రోజున ఉన్న గతి ఏమిటి? సామాన్యంగా democracy అంటె Government of the people, by the people, for the people అని చెప్తారు. కాని ఇప్పుడుండే పరిస్థితి చూస్తే మాత్రం, ఇది government of the party, by the party, for the party అని స్పష్టంగా అర్థం అవుతుంది.

ఇక ఈ budget గురించి ప్రస్తావించాలంటె, opposition పార్టీ తరపున ఉన్నటువంటి ఏ శాసన సభ్యుని నియోజక వర్గంలో కూడా ఒక పనిని గురించి కూడా ఈ బడ్జెటులో లేదు అనవలసివుంది. దీన్ని బట్టి ఒక విషయం మాత్రం స్పష్టంగా తేలుతుంది— ప్రజల తాలూకు డబ్బుతోటి కాంగ్రెస్ పార్టీ తాలూకు బడ్జెటును తయారు చేసుకొన్నారు కాని, ఇది ప్రజల తాలూకు బడ్జెటు కాదని నేను మనవి చేస్తున్నాను. ఈ రోజు అధికారంలో కాంగ్రెసు ఉన్నంత మాత్రాన, ఈ దేశమంతా కూడా వారి private property క్రింద భావించుకొని తమ ఇష్టం వచ్చిన విధంగా పోతున్నారు. ఇది చాలా శోచనీయమైన విషయం. ఈ బడ్జెటు గురించి ఒక్క మాటలో మనవి చేయాలంటే— వెనకబడ్డ ప్రాంతాలలోని లక్షలాది ప్రజల కన్నీటికి, నిట్టూర్పుకు యిది జమా ఖర్చు అవుతుంది. ప్రజాస్వామిక సిద్ధాంతానికి, ప్రాథమిక సూత్రాలకు కట్టించిన గోరీ మాత్రం అవుతుందని మనవి చేస్తున్నాను. ఇది ఈ రోజున అనుకోకుండా తటస్థించిన పరిస్థితి కాదు. ప్రభుత్వ వర్గములో ఉన్న పెద్దలు ప్రచారము చేస్తున్న విషయమే. ఇదివరకు శాసన సభలో చర్చకు వచ్చింది, ఆ వివరాలలోకి నేను యిప్పుడు పోను. దాని విషయాలు యిచే. ప్రతిపక్ష సభ్యుల ప్రాంతాలలో అభివృద్ధి కార్యక్రమాలలో ఏ ఒక్కదానికి ప్రభుత్వరీ ఆ`ెంట్ కాదని చాలా స్పష్టంగా ప్రకటించిన విషయాన్ని చాలా విచారంతో

మనవి చేస్తున్నాను. గజపతినగరం నియోజక వర్గములో మంత్రులు పాదంపెట్టిన ప్రతి గ్రామంలో చేసిన ప్రకటనలున్నవి, అది partisan attitude అని మేము ఛార్జి చేస్తున్నాం; అది నిజమో అబద్ధమో తేల్చుకో దలచుకుంటే ఒక కమిటీని వేయాలని మనవి చేస్తున్నాను. We are prepared to prove to the hilt. ఇది ప్రజాస్వామ్యమునకు దారి తీయదు; భంగము కలుగుతుంది. ఎవరైనా తన చేతి క్రింద ఉన్న ప్రాంతాన్ని మేప్ నుంచి తుడిచి పెట్టడానికి ప్రయత్నం చేస్తే యిది geographical disintegration కు eclipse of the Opposition కు దారి తీసే దురదృష్ట పరిస్థితులు ఏర్పడతాయి. ప్రభుత్వంలోని పెద్దలు దేశంలో constant and incessant state of Civil War ను ప్రవేశపెడుతున్నారని మనవి చేస్తున్నాను. ప్రజల నుంచి పన్నులు పుచ్చుకొనుటకు ప్రభుత్వమునకు అధికారం ఉన్నది గాని పనులు చేయడానికి సంబంధంలేదు అనే ధోరణిలో ప్రభుత్వం పోతే మేము కూడ పన్నుల నిరాకరణోద్యమానికి పూనుకొనవలసియుంటుంది. అది కాదు అంటే— యీ రాష్ట్రంతో సంబంధంలేదు. మేము ఎన్నికయిన ప్రాంతంలో మమ్మల్నైనా పరిపాలించుకోనీయండి— అని చెప్పే పరిస్థితి వస్తుంది. (నవ్వు). ఇది ఇందులో ఏ ఒక్కటి మంచి పద్ధతి కాదని నాకు తెలుసు. కాని ఈ ధోరణిలో పోతే ఒరిస్సా రాష్ట్రములో నయినా సహాయం యివ్వమని కోరుకునే పరిస్థితి వస్తుంది. ఈ రకంగా ప్రజా స్వామిక విలువలు దేశంలో పడిపోతాయి. ఇటువంటి దుర్భరమైన, నికృష్టమైన పరిస్థితులు ఏర్పడినవని హృదయావేదనతో మనవి చేస్తున్నాను. మొన్న జరిగిన ఎన్నికలలో 'మాకు ఓటు యివ్వకపోతే జాగ్రత్త' అని ప్రజలను భయపెట్టారు. వారి ఆశలను పెంచారు. మంత్రులు వచ్చారు. వారి వెనక జీపులో పెటిషనుదార్లు. 'మీకు రోడ్డు యిసున్నాము కాలవ యిస్తున్నాము. చెరువు యిస్తున్నాము" అని చెప్పారు. అధికార్లను తీసుకు వెళ్లారు. వెంటనే వ్రాయడం ప్రారంభించారు. ముఖ్యంగా గ్రామ కరణం మునసబు కాంగ్రెసుకు ప్రచారం చేసి తీరాలి. కమ్యూనిటీ డెవలప్‌మెంటు బ్లాక్సు ఉద్యోగస్తులను ఉపయోగించుకొన్నారు. ఈ రకంగా అడ్మినిష్ట్రేషన్‌ను కేవలం Party interest కోసం ప్రభుత్వంలోని పెద్దలు ఉపయోగిస్తున్నారు. ఒకే ఒక సీటు కోసం, యింత మెజారిటీ ఉన్న రోజులలో కూడ వారు యిటువంటివి చేస్తుంటే 1962 లో వచ్చే ఎన్నికలలో ఏమి జరుగుతుందో ఆలోచించటానికి భయపడుతున్నాను. 1962 వచ్చే నాటికి దేశంలో పరిపూర్ణంగా కాంగ్రెసు రాజ్యం కావాలని ఎటువంటి పనైనా చేస్తారని చెప్పవచ్చు. అందులో అనుమానంలేదు. అడ్మినిష్ట్రేటివ్ మెషినరీని ఏ విధంగా వాడుకొంటున్నారో యిదివరకు మనవి చేశాను. ముఖ్యంగా సంజీవయ్య గారు ఖమ్మంలో చేసినవి స్పష్టంగా తెలియపరచాను. ఆ విషయంలోకి యిప్పుడు పోను. ఈ పరిస్థితి ప్రతి ప్రాంతంలోను ఉంటోంది. ఇది ఎంతవరకు నిజమో

ర్నారణ చేయాలి. అధికారులను బదిలీ చేస్తామని బెదిరిస్తున్నారు. అడ్మినిస్ట్రేషను సంబంధించి ఒక ఎంక్వైరీ కమిటీని వేయాలి. కేరళ ప్రభుత్వంలో చూస్తే అక్కడ worst enemy of Kerala Government కేరళ ప్రభుత్వం judiciary tamper చేశారని గాని. యూనివర్శిటీ వ్యవహారాలు tamper చేశారనిగాని లేదు. ఈ రాష్ట్రంలో అటువంటి అనుమానాలకు అపోహలకు కారణం కనపడుతోంది. ఇది ఎంతవరకు నిజమో నేను ఎస్టాబ్లిష్ చేయుటకు అధికారాలు లేవు గాని అనుమానాలు ఉన్నవి. ఇటువంటి అనుమానం ఉండటం సరైన పద్ధతికాదు. Sovereign Democratic Republic of India జరుగుతున్నప్పుడు డెమాక్రసీకి వ్యతిరేకముగా బలములో ఉన్న అధికారపార్టీ వ్యవహరిస్తున్నప్పుడు, యీ ప్రభుత్వము ప్రజా స్వామ్యమునకు వ్యతిరేకముగా నడుస్తున్నదని మేము రిపబ్లిక్ ప్రెసిడెంటుకు తెలియబరచి ఆందోళన చెయవలసిన పద్ధతి ఏర్పడు తుందని మనవి చేస్తున్నాను.

శ్రీ పి. కోదండరామయ్య (పోలవరము): అధ్యక్షా, అర్థికమంత్రిగారి బడ్జెటు ప్రసంగమును నేను బలపరుస్తున్నాను. అయితే దీనిలో పెద్ద విశేషాలు ఏమీ లేవు ఇది చాల balanced budget అని చెప్పడానికి ఏమీ సందేహము లేదు. ముఖ్యంగా సంతానం కమిటీవారియొక్క రిపోర్టునుబట్టి సెంట్రల్ గవర్నమెంటువారి యొక్క గ్రాంట్సు, రాష్ట్రములకు రావడం మూలాన, రాష్ట్రాలన్నిటిలో యీ బడ్జెట్సు balanced గా ఉండడానికి ఎక్కడ అవకాశం కలిగింది. క్రొత్తపన్నులు లేకుండా, కేవలం small savings మీద ఆధారపడి, మనమనుకున్న deficit, Pay Committee recommendation వల్ల వచ్చే deficit కూడా కలుపుకొని. క్రొత్తపన్నులు లేకుండ ఈ బడ్జెటును తయారు చేసినందుకు వారిని అభినందించవలసి యుంటుంది.

ఆంధ్ర ప్రభుత్వం ఎక్కువ రాయలసీమను అభివృద్ధిలోకి తీసుకువచ్చింది. ఇప్పుడు ఎక్కువ తెలంగాణాను అభివృద్ధిలోకి తీసుకురావడానికి ప్రయత్నం చేస్తోంది దానికి నా అభినందనలు తెలియపరుస్తున్నాను. అయితే నేను నివసించే మెట్టతాలూకాలు, ఏజన్సీతాలూకాల విషయమై ప్రత్యేకదృష్టితో వ్యవహరించి పైకి తీసుకురావలసిన అగత్యం ఉన్నది. ఆ ప్రదేశాలలో నివసించేవారు చాల వెనకబడి ఉన్నారు. వారిని అభివృద్ధిలోకి తీసుకురావడానికి ఈ ప్రభుత్వం ఎక్కువ ప్రయత్నం చేయాలి. మిగతా కోస్తా జిల్లాలకు యిందులో విశేషంగా ఖర్చు ఉన్నట్లు అనుకోవడంలేదు మామూలుగా ఉండే expenditure తప్ప. పెద్ద ప్రాజెక్టులు గాని, Industrial Centres గాని, Minor irrigation projects గాని ఏమీ కనపడుటలేదు. అయితే తెలంగాణాను ప్రయోజనకారిగా చేస్తున్నందుకు సంతోషం. గోదావరి నదికి శ్రీవంశధారకు ఇచ్ఛంపల్లి వద్ద ప్రాజెక్టు కట్టితే మేము చాల సంతోష

ష్టాము దానివల్ల ఈ ప్రాంతాలకు ఎక్కువ ఉపయోగం ఉంటుంది. Multi-purpose scheme క్రింద అయితే యింకా ఎక్కువ లాభదాయకంగా ఉంటుందని మనవి చేస్తున్నాను.

గోదావరి నదికి అపకాశాన్నిబట్టి పోలవరంవద్ద barrage కట్టితే ఉపయోగపరంగా ఉంటుంది. చిన్న చిన్న వాటికి చేసేదానికంటే, గోదావరినదికి ఏదయినా కట్టితేనే ఆహార సమస్య తీరడానికి వీలుంటుంది.

మెట్టతాలూకాలో చిన్న చిన్న నదులు ఉన్నవి. నా నియోజకవర్గంలో కొవ్వూరు కాలువ, కల్లేరు. పైలేరు ఉన్నవి. వాటిమీద కూడ ప్రాజెక్ట్సు కట్టవలసిన అగత్యం ఉన్నది. అవికూడ తప్పకుండా తీసుకోవాలి

Minor Irrigation Works — పెద్ద పెద్ద చెరువులు, కొండవాగులు ఉన్నవి. గోదావరి pumping scheme ఉన్నది. మా నూతల పంపింగ్‌స్కీము వంటి స్కీమ్సు ఏర్పాటు చేస్తే ఎక్కువ ఆదాయం రావడానికి అవకాశం ఉన్నది. ఎక్కువ డబ్బుకూడ ఖర్చుపెట్ట నవసరంలేదు తొలిగడ్డ పంపింగ్ స్కీములాంటి ది కాదు. వాడపల్లి నుంచి పోలవరందాకా electricity connection కలిపితే చాలా లాభదాయకంగా ఉంటుంది. ఆ గ్రామాల వారే ఖర్చు పెడతారు. గవర్నమెంటువారు స్తంభాలువేసి electricity connect చేసేందుకు డబ్బు ఖర్చు పెట్టితే చాలు: స్వల్పసొమ్ముతో ఎక్కువ ఆహారోత్పత్తి జరగడానికి, దానిమీద ఆదాయం రావడానికి అవకాశం ఉంటుంది.

ముఖ్యంగా పోలవరంవద్ద 86 లక్షలు ఖర్చుచేసి యేటిగట్లు ఎత్తుచేస్తారన్నారు. పోలవరముకు ring bund లేదని ఎవరో చెప్పారని అనడం మంచిదికాదు. మన ప్రభుత్వమే చేస్తే బాగుంటుంది. ఎప్పుడో ఒకప్పుడు చేయక తప్పదు. ప్రజలకోరిక ప్రభుత్వం మన్నించవలసి యుంటుంది. అక్కడ ring bund ఏర్పాటు చేయవలసిన అగత్యం ఉన్నదని ప్రభుత్వానికి మనవి చేస్తున్నాను.

ఆహారసమస్య పరిష్కారము కావాలంటే. ఎలక్ట్రిసిటీ అభివృద్ధి చేయాలి. మా ప్రాంతములో ఎలక్ట్రిసిటీ లేదు. మా ప్రాంతము మెట్టప్రాంతము. కొవ్వూరు, పోలవరము, చింతలపూడి, తిరువూరు, చోడవరము, ఎల్లవరము, పెద్దాపురము లాంటి మెట్ట తాలూకాలకు ఎలక్ట్రిసిటీ ఇచ్చినట్లయితే, నూతులనుండి వాటర్ పంపు చేసుకొని పంటలు పండించటానికి అవకాశం ఉంటుంది. మా ప్రాంతానికి ఎలక్ట్రిసిటీ ఇస్తే, నూతులనుండి నీరు తోడుకొని, అధికాహారోత్పత్తి సాధించటానికి వీలవుతుంది. మా కొవ్వూరుతాలూకా పోలవరం గ్రామములో సుమారు 40 లక్షల రూపాయలు పొగాకు వల్ల సెంట్రల్ గవర్నమెంట్‌కు వస్తున్నది. ఈ ఒక్క గ్రామంలోనే అంత డబ్బు వస్తున్నది. అదే విధంగా ప్రతి గ్రామానికి తగినంత ఎలక్ట్రి

సిటీ ఇచ్చి నూతులనుండి వాటర్ పంప్ చేసుకొనుటకు అవకాశం కలుగజేస్తే, మన రాష్ట్రంలో విశేషమైన డబ్బు రావటానికి వీలుంటుంది. ముఖ్యంగా మా ఏజన్సీ ప్రాంతంలో ఆహారసమస్య చాలా జాస్తీగా ఉన్నది. అక్కడ కరువు ఉన్నది. ఆ ఏజన్సీ ప్రాంతంలోని జనం ఏమి తింటున్నారో, ఏమి చేస్తున్నారో, ఒకమాటు యీ శాసనసభ ఎప్పుడయినా దయయుంచి ఒకమాటు అక్కడవేస్తే (అలాంటి అవకాశం లేదనుకోండి!) తెలుస్తుంది, ఆ ఏజన్సీ ప్రజలు రాము పుట్టిన తర్వాత ఎప్పుడైనా తాము కట్టుకున్న గోచిగుడ్డ ఉతుకు కున్నారో లేదో, తలకు నూనె వ్రాసుకున్నారో లేదో; గంజిలో ఉప్పువేసికొని త్రాగారో లేదో మనం గమనించవలసి ఉన్నది. వారిని అభివృద్ధిలోకి తీసుకురావటానికి ట్రైబల్ వెల్ఫేర్ డిపార్టుమెంటు ఉన్నది కాని, ఆ డిపార్టుమెంటు అందించే సహాయం వారికి సక్రమంగా అందటంలేదని నేను మనవిచేయటానికి చాలా విచారిస్తున్నాను. వారిని మనం అభివృద్ధిలోకి తీసుకు రావాలి. పెద్ద స్కీములు కాకపోయినా, చిన్న స్కీములయినా ప్రతి గ్రామంలో అమలుజరపాలి. తూర్పుగోదావరి, పశ్చిమ గోదావరి, విశాఖ, శ్రీకాకుళం జిల్లాల లోని ఎజన్సీప్రాంతాలలో మంచి సారవంతమైన ప్రదేశాలు ఉన్నవి. అక్కడ చెరువులు, కొండవాగులు ఉన్నవి. మా ప్రాంతంలో కొడెంకాల్వ ఉన్నది. అక్కడి ప్రజలు రాతితో ఆ కాల్వపై కట్ట కట్టుకున్నారు. వారంతా రెండువేల రూపాయలతో కట్టుకొన్నారు. అక్కడికు ఇంజనీరుగారిని తీసుకువెళ్ళి చూపిస్తే, అది పదిహేనువేల రూపాయలతో అవుతుందని అన్నారు. 15 వేలతో అయ్యే పనిని అక్కడి ప్రజలు రెండువేలతో కట్టుకొన్నారు. అక్కడ ప్రతిగ్రామంలో ఇటువంటి చిన్నస్కీములు అమలుజరిపితే వారు ఆహారధాన్యాలు పండించుకోగలరు. ఆహారం పండించడమే కాదు, ఆహారం పోకుండా చూడాలి. ఏజన్సీప్రాంతంలో ఎంత దోపిడీ విధానం ఉన్నదో చెప్పటానికి తరంకాదు. విశాఖపట్నం, శ్రీకాకుళం జిల్లాలలో మార్కెటింగ్ సొసైటీలు పెట్టారు. అక్కడ వాటిని నెమ్మది నెమ్మదిగా జరుపుతున్నారు. ఏ గ్రామానికి ఆ గ్రామంలో ఒక్కొక్క చిన్నస్కీమును ఏర్పాటుచేసి అమలుజరపాలి. వారు పండించే ధాన్యం వారివద్దనే ఉంచుకొని, వాళ్ళ వ్యవహారం వాళ్ళే చేసుకొనే ట్లుగా సహాయం చేయుటకు కొంతమంది మనుష్యులను ఏర్పాటుచేయాలి. ఆవిధంగా మనము బడ్జెటును తయరుచేయాలిగాని, ఎప్పుడో 18వ సెంచరీనాటి బడ్జెటును తయారుచెసి, ఊరికే లెక్కలు వేసి పెద్ద పుస్తకము ఇవ్వటము కాదు. ప్రతి గ్రామంలో జరగవలసిన స్కీములకు కావలసిన డబ్బును కేటాయిస్తూ ఇకముందైనా అటువంటి బడ్జెటును తయారుచేయాలని కోరుతూ ఆర్థికమంత్రిగారి ఉపన్యాసాన్ని బలపరుస్తూ, ముగిస్తున్నాను.

మిస్టర్ స్పీకర్ : రేపు ఉదయము ఎనిమిదిన్నర గంటలకు సమావేశ మవుదాము.

***The House then adjourned till Half Past Eight of the clock on Wednesday, the 25th February 1959.***